# సంస్కృత క్రియలు

(ఆకాశవాణి వార్తలలో వచ్చునవి)


రచయిత

వ్యాకరణ విద్యాప్రవీణ

కండ్లకుంట అళహ సింగరాచార్యులు, ఎమ్.ఏ బి,ఇడి.






ప్రచురణ:


ప్రదేశ్ సాహిత్య అకాడమి

భవన్, సైఫాబాద్, హైదరాబాద్-500004

# సంస్కృత క్రియలు

(ఆకాశవాణి వార్తలలో వచ్చునవి)



రచయిత

వ్యాకరణ విద్యాప్రవీణ

కండ్లకుంట అళహ సింగరాచార్యులు, ఎమ్.ఏ బి,ఇడి.




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500004

# తొలిపలుకు

ఆకాశవాణివారు కొన్నిసంవత్సరములుగా సంస్కృతభాషలో వార్తా
ము జరుపుచున్నసంగతి శ్రోతలకు తెలియును. ఆ వార్తలను చాల
సంస్కృతాభిమానులు శ్రద్ధతో వినుట, అర్థముచేసికొనుట జరుగుచున్నది.
స్కృతక్రియాపదముల నర్థముచేసికొనుట సామాన్యపాఠకులకు శ్రమ
గా నున్నది.

సంస్కృతక్రియాపదములనుగూర్చి తెలుగులో ఇంతవరకు
త్మక మైన పుస్తకమురాని కొరతను ఆంధ్ర ప్రదేశ్ సాహిత్యఅకాడమీ
చి, అట్టిపుస్తకమును ప్రచురించుటకు నిశ్చయించినది. ఈవిషయములో
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు ఒక ప్రణాళికను సిద్ధముచేసి,
, పుస్తకరచనాకార్యము శ్రీ కే.ఏ సింగరాచార్యులుగారికప్పగించితిమి,
ంధ్రసారస్వతపరిషత్తు ప్రాచ్యకళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా
యుచున్నారు.

మేము కోరగనే యీకార్యభారమును స్వీకరించి, శ్రమతో వార్తలందలి
రూపములను సంగ్రహించి, వానికి చక్కనివివరణము వ్రాసిన
ంగరాచార్యులుగారికి, ఈగ్రంథరచనకు తగినప్రణాళికనిచ్చి, సలహా
శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారికిని అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈపుస్తకము సంస్కృతాభిమానులకు, ఆకాశవాణి శ్రోతలకు మార్గ
ముగా ఉండగలదని మావిశ్వాసము.

హైదరాబాదు.
15-3-78

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# విజ్ఞప్తి

ఆకాశవాణి ఢిల్లీకేంద్రము కొన్ని సంవత్సరములనుండి సంస్కృత భాషలో వార్తా ప్రసారములు జరుపుచున్న సంగతి శ్రోతలకు విదితమే. ఇటీవల యీవార్తాప్రసారములు ప్రతిదినము రెండుమార్లు జరుగుచున్నవి. ఆవార్తలనువిని యర్థము చేసికొనుట సామాన్య సంస్కృతపరిచయము కలవారికి కొంత శ్రమకరము. దానివిగురించి ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు, సంస్కృత వార్తల యందలి క్రియాపదములను గూర్చి వివరణాత్మకముగా నొక పుస్తకమును వ్రాయింప సంకల్పించిరి. ఇది యెంతయు ముదావహము.

సాహిత్యఅకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి యాదేశము ననుసరించి యీ పుస్తకరచనకు పూనుకొంటిని. మొదట వరుసగా 4,5 మాసములపాటు ప్రతిదినము సంస్కృత వార్తా ప్రసారములను విని, అందలి క్రియాపదములను వాక్యముల ద్వారా సేకరించి తరువాత వానికి వివరణము వ్రాయ బూనితిని.

ఈ పుస్తకము సంస్కృతభాషయందు విశేష పరిచయములేని సామాన్య పాఠకుల నుద్దేశించి వ్రాయబడినది. దీనిలో 150 సంస్కృతవార్తా వాక్యములు, అందలి క్రియాపదములు వివరింపబడినవి. వానితరువాత కొన్నిముఖ్యములయిన అవ్యయములు, కృదంతములనుగూర్చి కూడ పరిచయము చేయబడినది. క్రియాపదములను వివరించునప్పుడు, ఆ లకారములోని ఇతర పురుషవచనముల రూపములు కూడ ప్రదర్శింపబడినవి. కొన్నిచోట్ల పాఠకుల సౌకర్యమునకై ఇతరవాక్యములనుగూడ ఉదాహరణములుగా నిచ్చితిని. పాఠకులలో విశేష జిజ్ఞాస కలవారి కొఱకు, ధాతువులలోని దశగణములు, లకారములు, కర్తరి కర్మణి ప్రయోగములు, నామధాతువులు, ఉపసర్గలు మున్నగు వివిధ విషయములు అనుబంధము —1, 2 లలో విపులముగా వివరింపబడినవి. సంస్కృత వ్యాకరణముతో స్వల్పపరిచయమున్నవారి కవి యుపయోగించును.

సామాన్యపాఠకులకై వ్రాయబడినందున దీనిలో సరళమైన భాష నుపయోగించితిని. అరసున్నలు, శకటరేఫములు, సరళాదేశములవంటివి అంతగా పాటింపబడలేదు. అర్థము స్పష్టముగా తెలియుటకుగాను పెక్కుచోట్ల సంధి చేయకుండ వాక్యములను వ్రాసితిని. లోతైన వ్యాకరణ విషయములనుగూర్చి ప్రస్తావించలేదు.

నాకీ కార్యభారము నప్పగించి, సంస్కృతభాషాభిమానులకు సేవచేయు నవకాశము కల్గించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, ముఖ్యముగా కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావు గారికిని, ఏతత్ప్రచనయందు నాకు తగిన సలహాల నిచ్చి సహకారము నందించిన శ్రీ కేశవపంతుల నరసింహ శాస్త్రిగారికిని నాహృదయపూర్వక కృతజ్ఞతల నందించు చున్నాను. సహృదయ పాఠకులిందలి గుణములను గ్రహించి లోపములను మన్నించవలసినదిగా ప్రార్థితులు.

ఇట్లు

గ్రంథకర్త

# వి ష య సూ చి క

# సంస్కృత క్రియలు.

## మొదటి ప్రకరణము

సంస్కృత భాషలోని పదజాలమంతయు సుబంతములు, తిఙంతములు అని రెండు విధములుగా నుండును. సుప్పులు అనగా నామవిభక్తులు, తిఙ్లు అనగా క్రియావిభక్తులు. నామవాచకములు, విశేషణములు, అవ్యయములు - సుబంతములగును. క్రియాపదములు తిఙంతము లనబడును.

ధాతువు అనగా, క్రియాపదములోని మూలరూపము (Root) దానిపై క్రియావిభక్తులు చేరి క్రియాపదము లేర్పడును.

సంస్కృత భాషలో సుమారు రెండువేల ధాతువులున్నవి. వానిలో వాఙ్మయమందు ప్రచారములోనున్నవి రెండు వందలకుపైగా ఉండును. మొత్తము ధాతువులు పదివిధములుగా విభజింపబడినవి.

పరస్మైపది, ఆత్మనేపది, ఉభయపది - అని ధాతువులు మూడు రకములుగా నుండును. విభక్తి ప్రత్యయములు పరస్మైపదులకు, ఆత్మనేపదులకు వేర్వేరుగానున్నవి.

(1) పరస్మైపదప్రత్యయములు —

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమపురుష | తిప్ | తస్ | అంతి (ఝి) |
| మధ్యమపురుష | సిప్ | థస్ | థ |
| ఉత్తమపురుష | మిప్ | వస్ | మస్ |

(2) ఆత్మనేపద ప్రత్యయములు —

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమపురుష | త | ఆతామ్ | అంత (ఝ) |
| మధ్యమపురుష | థాస్ | ఆథామ్ | ధ్వమ్ |
| ఉత్తమపురుష | ఇట్ | వహి | మహిఙ్ |

ఉభయపది ధాతువులకు పరస్మైపది, ఆత్మనేపది — రెండు విధముల రూపములుండును.

లట్ మొ॥ లకారములు వర్తమానాది కాలములను, భావములను బోధించును వర్తమానార్థమునందు లట్, భూతకాలమునందు లఙ్, లిట్, లుఙ్, భవిష్యత్కాలమునందు ల్ృట్, లుట్; విధి, ప్రార్థన మొ॥ అర్థము లందు లిఙ్ మరియు లోట్. ఆశీస్సునందు లిఙ్ అను లకారములు ప్రయోగింప బడును.

క్రియాపదములతో గూడిన వాక్యములు:

1 కర్తరి ప్రయోగము (active voice)
2 కర్మణి ప్రయోగము (passive voice)

అని ప్రధానముగా రెండువిధములుగా నుండును.

1. అహం పుస్తకం పఠామి (కర్తరి ప్రయోగము)
   నేను పుస్తకమును చదువుచున్నాను.
2. మయా పుస్తకం పఠ్యతే (కర్మణి ప్రయోగము)
   నాచేత పుస్తకము చదువబడుచున్నది.

ధాతువులు అకర్మకములు (కర్మలేనివి), సకర్మకములు (కర్మతో గూడినవి) అని రెండురకములు.

ప్ర, పరా, అప మొదలగు 20 ఉపసర్గములు కలవు. ఇవి ధాతువులకు ముందు చేరుచుండును. అవి చేరుట వలన ధాతువుల అర్థముకూడ కొన్ని చోట్లమారుచుండును.

ఆయా లకారములు, పురుషములు, కర్తరి, కర్మణి ప్రయోగములు, ప్రేరణార్థకములు, సన్నంతములు మొదలగు విషయములనుగూర్చి విపులముగా అనుబంధము –1, 2 లలో వివరింపబడినది. జిజ్ఞాసువులు వానిని చదివి గ్రహింపవచ్చును. ఈ పుస్తకము సామాన్య పాఠకుల నుద్దేశించి వ్రాయ బడినది కాని పండితుల కొరకు గాదు. కావున దీనినాదృష్టితోనే పరిశీలింప వలసి యుండును.

ఆకాశవాణి ప్రతిదినము ప్రసారము చేయుచున్న సంస్కృత వార్తల యందలి క్రియా పదములను వాక్యములద్వారా పరిచయము చేయుటకు యత్నింతును. అర్థములు బ్రాకెట్లలో నీయబడినవి.

వాక్యము 1

ఇయమ్ ఆకాశవాణీ. (ఇది ఆకాశవాణి)

పైవాక్యములో క్రియాపదము ప్రయోగింపబడలేదు. కాని దానిని మనము అధ్యాహారము చేసికొందుము. అధ్యాహారమనగా వాక్యములోని పదమును సందర్భమును బట్టి యూహించి తెచ్చుకొనుట. ప్రస్తుతవాక్యములో 'అస్తి' అనుక్రియా పదము అధ్యాహారము. 'ఉన్నది' అని దానియర్థము.

వాక్యము 2

సంప్రతి వార్తాః <u>శ్రూయంతామ్</u>

(ఇప్పుడు వార్తలు వినబడుగాక) విందురుగాక అని భావము

దీనిలో క్రియాపదము 'శ్రూయంతామ్'

అర్థము = వినబడుమగాక

ఈ ధాతువు = 'శ్రు = శ్రవణే' (వినుట) అనునది

'లోట్' లకారము

ప్రథమ పురుషము – బహువచనము

కర్మణిప్రయోగము – ఆత్మనేపదము

ప్రథమ పురుషలోని 3 వచనముల రూపములు—

ఏ. శ్రూయతామ్ ద్వి. శ్రూయేతామ్ బ. శ్రూయంతామ్

శ్రు ధాతువు సహజముగా పరస్మైపది.

కర్మార్థము కానప్పుడు దాని రూపములిట్లుండును.

| | | | | |
|---|---|---|---|---|
| లట్ — | ప్ర. పు. | శృణోతి | శృణుతః | శృణ్వంతి |
| | మ. పు. | శృణోషి | శృణుథః | శృణుథ |
| | ఉ. పు. | శృణోమి | శృణువః / శృణ్వః | శృణుమః / శృణ్మః |

వాక్యము 3

శిక్షామంత్రీ శ్రీ ప్రతాపచంద్ర చందర్ ప్రాభాషత.

(విద్యామంత్రి శ్రీ ప్రతాపచంద్ర చందర్ పలికెను)

క్రియాపదము - ప్ర+అభాషత=ప్రాభాషత.

ధాతువు=భాష=వ్యక్తాయాంవాచి (వ్యక్తమగు వాక్కు-మాటాడుట)

ప్రాభాషత= వక్కాణించెను. "ప్ర" ఉపసర్గ.

భూతకాలము - లఙ్ రూపము

ఆత్మనేపది ధాతువు - ప్రథమ పురుష - ఏకవచనము. ఇది కర్తరి ప్రయోగము.

లఙ్ లోని మూడు పురుషములలోని రూపములు -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమ పురుష - | అభాషత | అభాషేతామ్ | అభాషంత |
| మధ్యమ పురుష - | అభాషథాః | అభాషేథామ్ | అభాషధ్వం |
| ఉత్తమ పురుష - | అభాషే | అభాషావహి | అభాషామహి. |

కొన్ని ఉదాహరణ వాక్యములు -

1. త్వమ్ అభాషథాః (నీవు మాట్లాడితివి) మ. పు. ఏకవచనము.
2. అహమ్ అభాషే (నేను మాట్లాడితిని) ఉ. పు ఏకవచనము.

వాక్యము 4

శ్రీ చరణసింహేన సబలం ప్రతి పాదితా.
(శ్రీ చరణ్ సింగ్ చేత దృఢముగా ప్రతిపాదింప బడినది)

టీనిలో "ప్రతి పాదితా" అనునది క్రియాపదమునకు బదులుగా వాడ బడిన సుబంత శబ్దము, ధాతువు మీద కృత్ ప్రత్యయము చేరగా ఏర్పడిన శబ్దములు కృదంతములనబడును అవి నామవాచకములు మొ॥ శబ్దములవలె రూపములు గలిగి యుండును. ప్రతిపాదితా అను శబ్దమునకు సమానార్థకమగు క్రియాపదము = ప్రత్యపాద్యత. ఇది కర్మార్థములో ప్రయోగింపబడిన పదము.

వాక్యము 5

ప్రధాన మంత్రీ శ్రీ మురార్జీ దేశాయ్ ప్రత్యపాదయత్.
(ప్రధాన మంత్రి శ్రీ మురార్జీ దేశాయి ప్రతిపాదించెను.)
ఇందలి క్రియాపదము = ప్రతి + ఆపాద యత్ =
ప్రత్యపాదయత్, యణాదేశము. ప్రతిపాదించెను అవి యర్థము
ధాతువు = పద = గతౌ (పొందుట, వెళ్లుట)
"ప్రతి" అనునది ఉపసర్గ
భూతకాలము – లజ్
ప్రథమ పురుష – ఏకవచనము.
పరస్మైపది ధాతువు.
పై వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

ధాతువు అసలు అర్థము గతి; అనగా పొందుట, వెళ్లుట, కాని ఉపసర్గ చేరుటవలన అర్థము మారినది. పై క్రియాపదము యొక్క మూడు పురుషలలోని రూపములీవిధముగా ఉండును.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు | ప్రత్యపాదయత్ | ప్రత్యపాదయతామ్ | ప్రత్యపాదయన్ |

| | | | |
|---|---|---|---|
| మ. పు | ప్రత్యపాదయః | ప్రత్యపాదయతమ్ | ప్రత్యపాదయత |
| ఉ. పు | ప్రత్యపాదయమ్ | ప్రత్యపాదయావ | ప్రత్యపాదయామ. |

వర్తమాన రూపములు (లట్)

ప్రతిపాదయతి ప్రతిపాదయతః ప్రతిపాదయంతి

ఇత్యాదిగానుండును.

వాక్యము 6

ప్రధానమంత్రీ లోకసభాయాం వ్యజ్ఞాపయత్.

(ప్రధానమంత్రి లోకసభయందు విజ్ఞప్తి చేసెను.)

క్రియాపదము=వ్యజ్ఞాపయత్ (విజ్ఞప్తిచేసెను)

వి+ఆజ్ఞాపయత్=వ్యజ్ఞాపయత్ యణాదేశసంధి.

ధాతువు, జ్ఞా=అవబోధనే అనునది. ప్రేరణార్థక రూపము.

భూతకాలము, లఙ్. ప్రథమ పురుష – ఏకవచన రూపము. పరస్మైపది ధాతువు.

పూర్తి రూపములు (లఙ్) పూర్వవాక్యమునందలి "ప్రత్యపాదయత్" అనుదానివలెనే యుండును. తెలిసికొనుట, తెలుపుట అను అర్థముకల "జ్ఞా" ధాతువు "వి" అను ఉపసర్గ చేరుటవలన, విన్నవించుట యను అర్థమును తెలుపుచున్నది

వర్తమానార్థము (లట్) లో –

విజ్ఞాపయతి విజ్ఞాపయతః విజ్ఞాపయంతి అను విధముగా నుండును.

వాక్యము 7

శ్రీ వాజపేయీ వీరేంద్ర మహాభాగం అమిలత్

(శ్రీ వాజపేయి వీరేంద్రులను కలిసెను)

ఇందలి క్రియాపదము = అమిలత్ (కలిసెను)

మీల = శ్లేషణే (కలియుట) అను ధాతువుయొక్క రూపము.

భూతకాలము - లఙ్ - ప్రథమ పురుష - ఏకవచన రూపము. ఇది పరస్మైపది ధాతువు.

లఙ్‌లోని మొత్తము రూపములు.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు, | అమిలత్ | అమిలాతామ్ | అమిలన్ |
| మ. పు. | అమిలః | అమిలతమ్ | అమిలత |
| ఉ. పు. | అమిలమ్ | అమిలావ | అమిలామ |

దీనికి కొన్ని ఇతరోదాహరణములు -

1 తే మాం అమిలన్ (వారు నన్ను కలిసిరి) ప్రథమ పురుష బహు వచనము.

2 వయం రామం అమిలామ (మేము రాముని కలిసితిమి) ఉత్తమ పురుష బహువచనము.

3 త్వం కదా గోపాలం అమిలః? (నీవు ఎప్పుడు గోపాలుని కలిసితివి)
మధ్యమ పురుష - ఏకవచనము

లట్ లో మిలతి, మిలతః, మిలంతి అను క్రమముగా రూపము లుండును.

వాక్యము 8

భారతదేశః ఉన్నతిమార్గం ఆరోహతి.

(భారతదేశము అభివృద్ధి మార్గము నధిష్ఠించుచున్నది)

క్రియాపదము = ఆరోహతి.

ధాతువు; రుహ = బీజజన్మని, ప్రాదుర్భావేచ.

(మొలకెత్తుట, పుట్టుట అని యర్థము)

"ఆ" అనునది ఉపసర్గ. దానితో గూడినందువలన ఎక్కుట యను నర్థమును బోధించుచున్నది.

వర్తమాన కాలము - లట్ - ప్రథమ పురుష - ఏకవచన రూపము.

ఇది కర్తరి ప్రయోగ వాక్యము.

లట్ లోని పూర్తి రూపములు -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ఆరోహతి | ఆరోహతః | ఆరోహంతి |
| మ. పు. | ఆరోహసి | ఆరోహథః | ఆరోహథ |
| ఉ. పు. | ఆరోహామి | ఆరోహావః | ఆరోహామః |

ఇతరోదాహరణములు -

1 త్వం వృక్షం ఆరోహసి (నీవు చెట్టునెక్కుచున్నావు)
మధ్యమ పురుష - ఏకవచనము.

2 అహం పర్వతం ఆరోహామి. (నేను కొండనెక్కుచున్నాను)
ఉత్తమ పురుష - ఏకవచనము

3. బాలకాః ప్రాసాదం ఆరోహంతి (పిల్లలు మేడను ఎక్కుచున్నారు) ప్రథమపురుష బహువచనము.

వాక్యము 9

ముఖ్యమంత్రిణాం సమావేశః ఆగామి మాసే ఆయోజయిష్యతే.
(ముఖ్యమంత్రుల సమావేశము వచ్చేనెలలో ఏర్పాటుచేయబడ గలదు)
ఇందలి క్రియాపదము = ఆయోజయిష్యతే

ధాతువు - యుజిర్ = యోగే (కూడిక) అనునది. 'ఆ' అను ఉపసర్గతో కూడి యున్నది. ప్రేరణార్థములో భవిష్యత్కాలము; లృట్ - ప్రథమపురుష ఏక వచన రూపము.

ఇది కర్మణి ప్రయోగము. ఆత్మనేపదరూపము. కూడుట అను అర్థము కల యీ ధాతువు ఉపసర్గ సంబంధమువలన "ఏర్పాటు చేయు" అనుఅర్థమును బోధించుచున్నది.

ధాతువులకు ఉపసర్గలు చేరినప్పుడు వాని మొదటి యర్థము సామాన్యముగా మారుచుండును.

సహజముగా ఈధాతువు పరస్మైపది. ప్రేరణార్థము లేనప్పుడు దీని లట్ రూపములు, యునక్తి యుంక్తః యుంజంతి అను విధముగా నుండును. ఇది 7వ గణములోని ధాతువు.

కర్మార్థములో అన్ని ధాతువులు ఆత్మనేపద రూపములనే పొందును.

దీని ల్రుట్ రూపములు మొత్తము :—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ఆయోజయిష్యతే | ఆయోజయిష్యేతే | ఆయోజయిష్యంతే |
| మ. పు. | ఆయోజయిష్యసే | ఆయోజయిష్యేథే | ఆయోజయిష్యధ్వే |
| ఉ. పు. | ఆయోజయిష్యే | ఆయోజయిష్యావహే | ఆయోజయిష్యామహే |

వాక్యము 10

శ్రీ పటేలః రాజ్యేభ్యః న్యవేదయత్.

(శ్రీ పటేల్ రాష్ట్రములకు తెలియపరచెను.)

ఇందలి క్రియాపదము = న్యవేదయత్ (తెలియపరచెను)

ని + అవేదయత్ = న్యవేదయత్ యణాదేశసంధి.

ధాతువు; విద = జ్ఞానే (తెలియుట) 'ని' అనునది ఉపసర్గ.

ప్రేరణార్థకము - భూతకాలము - లఙ్ - ప్రథమపురుష - ఏకవచన రూపము పరస్మైపదము.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | న్యవేదయత్ | న్యవేదయతామ్ | న్యవేదయన్ |
| మ. పు. | న్యవేదయః | న్యవేదయతమ్ | న్యవేదయత |
| ఉ. పు. | న్యవేదయమ్ | న్యవేదయావ | న్యవేదయామ |

"విద" ధాతువు సహజరూపములు (ప్రేరణార్థకము కానప్పుడు)

వేత్తి విత్తః విదంతి (లట్) ఇత్యాదిగా ఉండును.

ఈ ధాతువు అదాది (2వ) గణములో జేరినది.

వాక్యము 11

భారత ప్రశాసనం కృతసంకల్పం అస్తి

(భారత ప్రభుత్వము గట్టి సంకల్పము కలదై యున్నది.)

దీనిలో క్రియాపదము = అస్తి (ఉన్నది)

ధాతువు = అస = భువి (ఉండుట)

వర్తమానకాలము-లట్ - ప్రథమపురుష - ఏకవచనరూపము. పరస్మైపది ధాతువు. ఇది కర్తరిప్రయోగము.

లట్ లోని రూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అస్తి | స్తః | సంతి |
| మ. పు. | అసి | స్థః | స్థ |
| ఉ. పు. | అస్మి | స్వః | స్మః |

మరికొన్ని యుదాహరణవాక్యములు:—

1. త్వం ఇదానీం తత్ర అసి (నీవుఇప్పుడు అక్కడ ఉన్నావు) మధ్యమపురుష - ఏకవచనము

2. అహం మమగృహే అస్మి (నేను నాయింటియందు ఉన్నాను) ఉత్తమపురుష - ఏకవచనము)

3. రామః తత్ర అస్తి (రాముడు అక్కడ ఉన్నాడు) (ప్రథమ పురుష-ఏకవచనము.

వాక్యము 12

కమలాపతి త్రిపాఠినా బ్రహ్మానందరెడ్డిః విజ్ఞాపితః

(శ్రీ కమలాపతి త్రిపాఠిచేత బ్రహ్మానందరెడ్డి విన్నవింపబడెను.)

దీనిలోని 'విజ్ఞాపితః' అను పదము క్రియాపదమునకు మారుగా ప్రయోగింపబడిన సుబంతము. ధాతువులమీద కృత్ ప్రత్యయములు చేరగా ఏర్పడిన కృదంత శబ్దములను క్రియాపదముల స్థానమున ప్రయోగించుట జరుగుచుండును. ఇది అటువంటిశబ్దమే.

అకారాంత పులింగశబ్దము, ప్రథమా విభక్తి ఏకవచన రూపము.

వాక్యము 13

కేంద్రంసర్వైఃరాజ్యైఃసహ సమం వ్యవహరిష్యతి.

(కేంద్రము అన్ని రాష్ట్రములతో గూడ సమానముగా వ్యవహరింపగలదు)

ఇందలి క్రియాపదము=వ్యవహరిష్యతి వి+అవ+హరిష్యతి.

ధాతువు- హృఞ్=హరణే అనునది 'వి, అవ' ఉపసర్గలు.

భవిష్యత్కాలము - ల్పట్ - ప్రథమపురుష - ఏకవచన రూపము పరస్మైపది ధాతువు.

పైవాక్యము కర్తరి ప్రయోగములో నున్నది. హరించుట అను ధాత్వర్థము ఉపసర్గలచేరిక వలన మార్పును బొందినది.

ల్పట్ లోని సర్వరూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు. వ్యవ+ | హరిష్యతి | హరిష్యతః | హరిష్యంతి |

| | | | |
|---|---|---|---|
| మ. పు. ,, | హరిష్యసి | హరిష్యథః | హరిష్యథ |
| ఉ. పు. ,, | హరిష్యామి | హరిష్యావః | హరిష్యామః |

వాక్యము 14

వాణిజ్యమంత్రీ శ్రీ మోహనధారియా అవాదీత్

(వాణిజ్యమంత్రి శ్రీ మోహనధారియా చెప్పెను)

దీనిలోని క్రియాపదము — అవాదీత్ (చెప్పెను)

వద — వ్యక్తాయాంవాచి (మాటాడుట) అను ధాతువుయొక్క రూపము.

భూతకాలము – లుఙ్ – ప్రథమపురుష ఏకవచన రూపమిది. ఇది మొదటి గణములోని పరస్మైపది ధాతువు కర్తరి ప్రయోగము.

ఈ లకారములోని పూర్తిరూపములు —

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అవాదీత్ | అవాదిష్టామ్ | అవాదిషుః |
| మ. పు. | అవాదీః | అవాదిష్టమ్ | అవాదిష్ట |
| ఉ. పు. | అవాదిషమ్ | అవాదిష్వ | అవాదిష్మ |

ఈ ధాతువు వర్తమానార్థములో:—

వదతి  వదతః  వదంతి

మొదలగు రీతిగా రూపములుండును,

వాక్యము 15

కాంగ్రెస్ మహాసచివః శ్రీ కిషన్‌చంద్ర పంతః అవోచత్.

(కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీకిషన్‌చంద్రపంత్ పలికెను. అన్నాడు)

ఇందలి క్రియాపదము — అవోచత్ (పలికెను)

వచ — పరిభాషణే (మాట్లాడుట) అను ధాతువు యొక్క రూపమిది.
భూతకాలము – లుఙ్ – ప్రథమ పురుష ఏకవచనరూపము.

ఈ ధాతువు అదాది (2వ) గణములోనిది. పరస్మైపది. కర్తరి ప్రయోగ వాక్యమిది.

లుఙ్ లోని స్వరూపములు :-

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అవోచత్ | అవోచతామ్ | అవోచన్ |
| మ. పు | అవోచః | అవోచతమ్ | అవోచత |
| ఉ. పు. | అవోచమ్ | అవోచావ | అవోచామ |

కొన్ని యితరోదాహరణములు :-

1. త్వం తం విషయం అవోచః. మధ్యమ పురుష - ఏకవచనము
(నీవు ఆ విషయమును చెప్పితివి)
2. యూయం ఇమం వృత్తాంతం అవోచత.
(మీరు ఈ సంగతిని చెప్పితిరి) మధ్యమ పురుష బహువచనము.

మాటలాడుట అను అర్థములో సంస్కృత భాషలో. వచ్ ధాతువుతో బాటు వద. భాష, జల్ప, కథ, లప, గద, మొ॥ పెక్కు ధాతువులు కలవు.

వాక్యము 16

ప్రధాన మంత్రిణా సందేశః ప్రేషితః.
(ప్రధాన మంత్రిచేత సందేశము పంపబడినది.

పై వాక్యములోని "ప్రేషితః" అను పదము క్రియాపదము స్థానములో ప్రయోగింపబడినది. ఇది క్త ప్రత్యయాంతమగు సుబంతశబ్దము, దీనికి సమానార్థకమైన తిఙంత క్రియాపదము = ప్రైష్యత (పంపబడెను)

వాక్యము 17

రాజ్యపాలేన ఇదమ్ అకథ్యత.
(గవర్నర్ చేత ఈ విషయము చెప్పబడెను.)

ఇందలి క్రియాపదము = అకథ్యత. (చెప్పబడెను)

ధాతువు - కథ = వ్యక్తాయాంవాచి అనునది.

భూతకాలము - లఙ్ - ప్రథమ పురుష ఏకవచన రూపమిది. కర్మణి ప్రయోగము.

ఆత్మనేపది ధాతు రూపము.

లఙ్ లోని మొత్తము రూపములు :—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అకథ్యత | అకథ్యేతామ్ | అకథ్యంత |
| మ. పు. | అకథ్యథాః | అకథ్యేథామ్ | అకథ్యధ్వమ్ |
| ఉ. పు. | అకథ్యే | అకథ్యావహి | అకథ్యామహి |

కథనమ్, కథా అను పదములీ ధాతువునుండి యేర్పడినవే.

వాక్యము 18

కాంగ్రెస్ సదస్యః సదనాత్ బహిర్గతః.
(కాంగ్రెస్ సభ్యుడు సభనుండి బయటకు వెళ్లెను)

ఈ వాక్యములోని గతః అను సుబంత శబ్దము క్రియాపదమునకు బదులుగా ప్రయోగింపబడినది. గమ్ ధాతువునుండి పుట్టిన కృదంత శబ్దమిది, ఈ రూపము బోధించు అర్థమును అగచ్ఛత్ లేక అగాత్ అను తిఙంత రూపములద్వారా కూడ తెలుపవచ్చును,

గతః = అకారాంత పుంలింగ శబ్దము. ప్రథమా విభక్తి ఏకవచనము.

వాక్యము 19

మహారాష్ట్ర ముఖ్యమంత్రీ ఆకాశవాణీం "అభ్యనందత్"
(మహారాష్ట్ర ముఖ్యమంత్రి ఆకాశవాణిని అభినందించెను)

ఈ వాక్యములోని క్రియాపదము = అభ్యనందత్.

అభి + అనందత్ = అభ్యనందత్ (కొనియాడెను). టునది = సమృద్ధౌ అను ధాతువుయొక్క లఙ్ రూపము. భూతకాలము, ప్రథమ పురుష ఏక వచనము.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అభ్యనందత్ | అభ్యనందతామ్ | అభ్యనందన్ |
| మ. పు. | అభ్యనందః | అభ్యనందతమ్ | అభ్యనందత |
| ఉ. పు. | అభ్యనందమ్ | అభ్యనందావ | అభ్యనందామ |

## వాక్యము 20

ఆకాశవాణీ దూరదర్శనే రాజనైతిక, సామాజిక దుష్ప్రభావేభ్యః

అచిరం విముక్తే భవిష్యతః.

(రేడియో, టెలివిజన్ సంస్థలు, రాజకీయ, సాంఘిక పరములైన చెడు ప్రభావములనుండి త్వరలో విముక్తములు కాగలవు.)

ఈ వాక్యములోని క్రియాపదము = భవిష్యతః.

భూ = సత్తాయామ్ (ఉండుట) అను ధాతువుయొక్క భవిష్యత్కాల రూపము. ల్పట్ - ప్రథమ పురుష - ద్వి వచనము. ఇది కర్తరి ప్రయోగము.

ల్పట్‌లో మొత్తము రూపములు —

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | భవిష్యతి | భవిష్యతః | భవిష్యంతి |
| మ. పు. | భవిష్యసి | భవిష్యథః | భవిష్యథ |
| ఉ. పు. | భవిష్యామి | భవిష్యావః | భవిష్యామః |

ఇది పరస్మైపది ధాతువు.

వాక్యము 21

సంగీత కళాకారేభ్యః పురస్కారాః ప్రదత్తాః.

(సంగీత కళాకారులకు బహుమతులు ఈయబడినవి)

ఈ వాక్యములోని ప్రదత్తాః అను శబ్దము క్రియాపదము స్థానమున ప్రయోగింపబడినది. ఇది కృదంత శబ్దము. క్త ప్రత్యయాంతమైన రూపము. అకారాంత పుంలింగశబ్దము, ప్రథమా విభక్తి బహువచనరూపము.

వాక్యము 22

ఆకాశవాణ్యాః ఢిల్లీకేంద్రం శ్వః రాష్ట్రపతి పదవీస్వీకార కార్యక్రమస్య నివేదికాం "ప్రసారయిష్యతి".

(ఆకాశవాణి ఢిల్లీ కేంద్రము రేపు రాష్ట్రపతి పదవీ స్వీకార కార్యక్రమపు నివేదికను ప్రసారము చేయగలదు)

పై వాక్యములోని క్రియాపదము = ప్రసారయిష్యతి.

సృ = గతౌ అను ధాతువుయొక్క ప్రేరణార్థక రూపము. భవిష్యత్కాలము - లృట్ - ప్రథమ పురుష - ఏకవచనమునందలి రూపము. పరస్మైపది ధాతువు, కర్తరి ప్రయోగము. "ప్ర" అనునది ఉపసర్గ.

లృట్ లోని మొత్తము రూపములు.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్రసారయిష్యతి | ప్రసారయిష్యతః | ప్రసారయిష్యంతి |
| మ. పు. | ప్రసారయిష్యసి | ప్రసారయిష్యథః | ప్రసారయిష్యథ |
| ఉ. పు. | ప్రసారయిష్యామి | ప్రసారయిష్యావః | ప్రసారయిష్యామః |

వర్తమానార్థకమగు లట్‌లో -

ప్రసారయతి ప్రసారయతః ప్రసారయంతి అను విధముగా నుండును.

వాక్యము 23

మూల్యానామపచయాయ ప్రయత్నాః చతుర్మాసాభ్యంతరే ఫలినః "భవిష్యంతి"

(ధరలను తగ్గించే ప్రయత్నాలు నాలుగు నెలలలోపుగానే సఫలములు కాగలవు)

ఈ వాక్యమందలి క్రియాపదము=భవిష్యంతి.

భూ=సత్తాయామ్ అను ధాతువుయొక్క భవిష్యత్కాలపు రూపము. లృట్ - ప్రథమ పురుష - బహువచనము. కర్తరి ప్రయోగము.

దీని లృట్ రూపములు 20వ వాక్యపు వివరణములో చూపబడినవి. ఆవాక్యములోనిది ద్వివచనముకాగా ఇక్కడిది బహువచనము.

వాక్యము 24

నూతన రాష్ట్రపతిః శ్రీ నీలం సంజీవరెడ్డిః బహుభిః ప్రముఖైః అభినందితః.

(క్రొత్త రాష్ట్రపతి శ్రీసంజీవరెడ్డి చాలమంది ప్రముఖులచేత అభినందింప బడినాడు.)

పైవాక్యములోని అభినందితః అనుపదము, క్రియాపదమునకు బదులుగా వాడబడిన కృదంత శబ్దము. భూతకాల కర్మార్థములో క్త ప్రత్యయము వచ్చిన రూపము.

ఇది అకారాంత పుంలింగశబ్దము. ప్రథమావిభక్తి, ఏకవచనము.

దీనికి సమానార్థకమైన క్రియాపదము=అభ్యనంద్యత అనియుండును.

వాక్యము 25

ఆగ్రాసమీపే కుషాణ కాలీనాని మృత్తికా పాత్రావశేషాణి సంలబ్ధాని.

(ఆగ్రా సమీపమందు కుషాణుల కాలపు మట్టి పాత్రల శిధిలాలు దొరికినవి.

ఈవాక్యమునందు సంలబ్ధాని అను పదము క్రియాపదము స్థానములో ప్రయోగింప బడినది. లభ్ ధాతువుపై క్త ప్రత్యయమురాగా ఏర్పడిన కృదంత శబ్దమిది. అకారాంత నపుంసకలింగశబ్దము. ప్రథమావిభక్తి బహువచన రూపము. దీని యర్థములో సమలభ్యంత అను క్రియాపదమును ప్రయోగించిన సరిపోవును. అదికర్మార్థకమగు తిఙంతరూపము.

వాక్యము 26

దేశదారిద్ర్యం సహసా నిర్మూలయితుం న శక్యతే.

(దేశము యొక్క బీదతనము ఒక్కసారిగా నిర్మూలించుట సాధ్యము కాదు)

పై వాక్యములోని క్రియాపదము=శక్యతే

అర్థము - శక్యతే=సాధ్యమగును. వ్యతిరేకార్థకమగు "న" చేరుట వలన వాక్యములో అటువంటి యర్థము వచ్చినది,

ఇది శక్య=శక్లృ అను ధాతువు యొక్క కర్మార్థక రూపము. వర్తమాన కాలము - లట్ - ప్రథమ పురుష - ఏకవచనము నందలి రూపమిది.

లట్‌లో దీని రూపములు పూర్తిగా నిట్లుండును.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | శక్యతే | శక్యేతే | శక్యంతే |
| మ. పు. | శక్యసే | శక్యేథే | శక్యధ్వే |
| ఉ. పు. | శక్యే | శక్యావహే | శక్యామహే |

కర్త్రర్థములో -

శక్నోతి　　శక్నుతః　　శక్నువంతి

అను క్రమములో దీని రూపములుండును.

ఇది స్వాది (5వ) గణములోని ధాతువు.

నిర్మూలయితుమ్ అనునది తుమున్ ప్రత్యయాంతమగు అవ్యయము. తొలగించుటకు అని దాని యర్థము.

వాక్యము 27

భారతదేశః స్వీయాంతరంగికవిషయేషు ఇతరదేశానాం
హస్తక్షేపం న సహిష్యతే.

(భారతదేశము తమ అంతరంగిక విషయములందు ఇతరదేశాల జోక్యమును సహింపదు.)

ఈ వాక్యములోని క్రియాపదము—సహిష్యతే—సహింపగలదు అని దాని యర్థము. "న" తో చేరినందున వ్యతిరేకార్థము కలిగినది.

షహ—మర్షణే (సహించుట) అను ధాతువుయొక్క భవిష్యదర్థకమగు రూపము. ల్రుట్ - ప్రథమ పురుష - ఏకవచనము.

ఇది ఆత్మనేపది ధాతువు.

ల్రుట్ లో మొత్తము రూపములు -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | సహిష్యతే | సహిష్యేతే | సహిష్యంతే |
| మ. పు. | సహిష్యసే | సహిష్యేథే | సహిష్యధ్వే |
| ఉ. పు. | సహిష్యే | సహిష్యావహే | సహిష్యామహే |

వర్తమానార్థము (లట్) లో -

సహతే సహేతే సహంతే

ఇత్యాదిగా నుండును.

వాక్యము 28

లోకపాల నియామక సంబంధి పత్రం లోకసభాయాం ప్రవేశయితుం రాష్ట్రపతిః సమ్మతిమ్ అదాత్.

(లోకపాల్‌ను నియమించుటకు సంబంధించిన బిల్లును లోకసభలో ప్రవేశపెట్టుటకు రాష్ట్రపతి తన ఆమోదము నిచ్చెను.)

ఈ వాక్యములోని క్రియాపదము=అదాత్. దాని అర్థము "ఇచ్చెను" అని.

డు దా ఞ్=దానే అను ధాతువుయొక్క రూపమిది. భూతకాలము - లుఙ్ - ప్రథమ పురుష - ఏకవచన రూపము.

ఈ లకారములోని సర్వరూపములు -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | అదాత్ | అదాతామ్ | అదుః |
| మ. పు. | అదాః | అదాతమ్ | అదాత |
| ఉ. పు. | అదామ్ | అదావ | అదామ |

ఈ ధాతువు 3వ గణములోనిది. వర్తమానార్థములో

దదాతి దత్తః దదతి

మొద॥ రూపములుండును.

దానమ్, దాతా, దత్తమ్ శబ్దములీ ధాతువు నుండి పుట్టినవే.

పై వాక్యములోని ప్రవేశయితుమ్ అనునది తుమున్ ప్రత్యయాంతమగు ను. ప్రవేశ పెట్టుటకు అని దాని యర్థము.

ను 29

త్రిపురరాజ్యే నూతనమంత్రివర్గేణ పదవీప్రమాణం స్వీకృతమ్.

(త్రిపుర రాష్ట్రంలో క్రొత్త మంత్రి వర్గము చేత పదవీ ప్రమాణము స్వీకరింపబడినది)

ఇందలి స్వీకృతమ్ అను శబ్దము విధేయ విశేషణము. క్రియాపదమునకు వాడబడినది.

అకారాంత నపుంసకలింగ శబ్దము. ప్రథమా విభక్తి ఏకవచనరూపము.

ను 30

శ్రీ జయప్రకాశనారాయణః న్యగదత్ యత్ జనతా పక్షీయైః ఐకమత్యేన వర్తితవ్యమ్.

(శ్రీ జయప్రకాశనారాయణ, జనతా పక్షము వారు ఐకమత్యముతో గునని పలికెను.)

ఈ వాక్యములోని క్రియాపదము=న్యగదత్ ని+అగదత్=న్యగదత్ ను) యణాదేశము.

గద=వ్యక్తాయాంవాచి అను ధాతువు యొక్క రూపము. భూతకాలము, ప్రథమ పురుష - ఏకవచనరూపము.

పరస్మైపది ధాతువు. కర్తరి ప్రయోగము. "ని" ఉపసర్గతో కూడి ది.

లఙ్ లోని రూపములు—

| | | |
|---|---|---|
| ఏక | ద్వి | బహు |
| న్యగదత్ | న్యగదతామ్ | న్యగదన్ |
| న్యగదః | న్యగదతమ్ | న్యగదత |
| న్యగదమ్ | న్యగదావ | న్యగదామ |

వర్తితవ్యమ్ అనుపదము క్రియనుబోధించు సుబంతశబ్దము. ఉండదగును అని దాని యర్థము. ఇది అకారాంత నపుంసకలింగశబ్దము. ప్రథమా విభక్తి, ఏకవచనము.

కర్తవ్యమ్, పఠితవ్యమ్, శ్రోతవ్యమ్, ద్రష్టవ్యమ్ మొ॥ ఇటువంటి శబ్దములే.

వాక్యము 31

శ్రీమతీ ఇందిరాగాంధీ పునః అధికారసంపాదనాయ ప్రయతతే.

(శ్రీమతి ఇందిరాగాంధి తిరిగి అధికారమును సంపాదించుటకు ప్రయత్నించుచున్నది.

ఈ వాక్యము నందలి క్రియాపదము—

ప్రయతతే (ప్రయత్నించుచున్నది)

యతీ—ప్రయత్నే అనుధాతువుయొక్క వర్తమానార్థక రూపము లట్—ప్రథమ పురుష ఏకవచనము. ఆత్మనేపది ధాతువు.

'ప్ర' అనునది ఉపసర్గ

ఇది కర్తరి ప్రయోగము.

లట్ లోని స్వరూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ప+యతతే | యతేతే | యతంతే |

| | | | |
|---|---|---|---|
| మ. పు. | యతసే | యతేధే | యతధ్వే |
| ఉ. పు. | యతే | యతావహే | యతామహే |

కొన్ని ఇతరోదాహరణ వాక్యములు—

1 అహం ఉద్యోగార్థం ప్రయతే

(నేను ఉద్యోగము కొరకు ప్రయత్నించుచున్నాను) ఉత్తమ పురుష—ఏకవచనము

2 త్వం సుఖజీవనాయ ప్రయతసే

(నీవు సుఖజీవనముకొరకు ప్రయత్నించుచున్నావు) మధ్యమపురుష-ఏకవచనము.

3 యూయం ప్రయతధ్వే

(మీరు ప్రయత్నించుచున్నారు.) మధ్యమపురుష బహువచనము.

వాక్యము ౩2

వయం జనతాయాః కల్యాణం అభిలషామః.

(మేము ప్రజలయొక్క శుభమును కోరుచున్నాము) ఇందలి క్రియా పదము = అభిలషామః

అర్థము = కోరుచున్నాము

ధాతువు = లష = కాంతౌ (కోరిక)

"అభి" అనునది ఉపసర్గ.

వర్తమానార్థమందు లట్ ఉత్తమపురుష బహువచనరూపము.

లట్‌లో మొత్తము రూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. అభి+ | లషతి | లషతః | లషంతి |

| | | | |
|---|---|---|---|
| మ. పు. | లషసి | లషథః | లషథ |
| ఉ. పు. | లషామి | లషావః | లషామః |

పై రూపములు కాక, లష్యతి, లష్యతః, లష్యంతి అను యకారముతో గూడిన రూపాంతరములు కూడ కలవు

ఇది పరస్మైపది ధాతువు.

కర్తరి ప్రయోగవాక్యము

వాక్యము ౩౩

ఆగ్నేయాస్త్రాణాం ప్రక్షేపణం సమభవత్.

(ఆగ్నేయాస్త్రముల (బాంబుల) ప్రయోగము జరిగినది.)

పై వాక్యములోని క్రియాపదము = సమభవత్ సమ్ + అభవత్ = జరిగెను.

"భూ = సత్తాయామ్" అను ధాతువు యొక్క రూపము, "సమ్" అను ఉపసర్గతో గూడినది.

భూతకాలము - లఙ్ - ప్రథమ పురుష - ఏకవచనమందలి రూపము,

ఈ ధాతువు పరస్మైపది. కర్తరి ప్రయోగవాక్యమిది.

ఈ క్రియ యొక్క లఙ్ రూపములివి-

| | | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|
| ప్ర. పు. | సమ్ + | అభవత్ | అభవతామ్ | అభవన్ |
| మ. పు. | | అభవః | అభవతమ్ | అభవత |
| ఉ. పు. | | అభవమ్ | అభవావ | అభవామ |

భూ ధాతువు మొదటి గణము మొదటి ధాతువు.

వాక్యము 34

ఏకేన సదస్యేన ఇదం పరామర్శితమ్.

(ఒక సభ్యునిచేత ఈ విషయము ప్రస్తావించ బడినది.)

పై వాక్యములో పరామర్శితమ్ అను-పదము కృదంతమగు విధేయ విశేషణము. ఇది క్రియా పదమునకు బదులు వాడబడినది.

పరామర్శితమ్=ప్రస్తావించబడినది.

ఇది అకారాంత నపుంసకలింగ శబ్దము. ప్రథమా విభక్తి ఏకవచన రూపము.

దీనిని తిజంత రూపములో "పరామృశ్యత" అని చెప్పవచ్చును.

వాక్యము 35

ఢాకా సంభాషణాని సమ్యక్ ప్రవర్తంతే.

(ఢాకాలో జరుగు సంభాషణలు బాగుగా జరుగుచున్నవి.)

ఇందలి క్రియాపదము=ప్రవర్తంతే (జరుగుచున్నవి)

ధాతువు. వృతు=వర్తనే అనునది. "ప్ర" ఉపసర్గ.

వర్తమానకాలము - లట్ - ప్రథమ పురుష బహువచన రూపము. ఆత్మనేపది ధాతువు, భ్వాది గణములోనిది. ఈ వాక్యము కర్తరి ప్రయోగము.

లట్ లోని స్వరూపములు -

| | | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|---|
| ప్ర. పు. | ప్ర+ | వర్తతే | వర్తేతే | వర్తంతే |
| మ. పు. | | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| ఉ. పు. | | వర్తే | వర్తావహే | వర్తామహే |

మరికొన్ని వాక్యములు -

కాశీనగరం గంగా తీరేవర్తతే.
(కాశీపట్టణము గంగా తీరమున ఉన్నది) } ప్రథమ పురుష - ఏకవచనము.

2. వయం భాగ్యనగరే వర్తామహే
(మేము భాగ్యనగరమందు ఉంటున్నాము.).
ఉత్తమ పురుష బహువచనము.

వాక్యము ౩౬

జనతా పక్ష నేతారః వదంతి.

(జనతాపార్టీ నాయకులు చెప్పుచున్నారు.)

ఈ వాక్యములోని క్రియాపదము = వదంతి. దాని యర్థము, చెప్పుచున్నారు అని.

ధాతువు, వద = వ్యక్తాయాం వాచి (పలుకుట. మాటలాడుట) అనునది.

వర్తమానకాలము - లట్ - ప్రథమ పురుష బహువచనరూపము.

ఇది పరస్మైపది ధాతువు.

పై వాక్యము కర్తరి ప్రయోగము.

ఈ ధాతువు లట్ రూపములు 32వ వాక్యములోని "అభిలషామః" అను క్రియాపదములకు వలెనుండును.

వదతి వదతః వదంతి మొద॥

ఈ ధాతువునుండి యేర్పడు కృదంత శబ్దములు వేర్వేరు ఉపసర్గలు చేరినప్పుడు విభిన్నార్థముల నిచ్చును.

ఎట్లనగా -

1. (ప్ర) వాదః = వాడుక. వ్యవహారము.

2. (వి) వాదః = కలహము
3. (అప) వాదః = నిందవేయుట
4. (సం) వాదః = సంభాషణ
5. (అను) వాదః = చెప్పినదానిననుసరించి చెప్పుట.

వాక్యము 37

ప్రధానమంత్రిణా రాజ్యసభా 'వ్యజ్ఞాప్యత'

(ప్రధానమంత్రిచేత రాజ్యసభ విన్నవింపబడినది.)

ఇందలి క్రియాపదము=వ్యజ్ఞాప్యత (విన్నవింపబడెను.)

'జ్ఞా=అవబోధనే' అను ధాతువుయొక్క ప్రేరణార్థకమైన రూపము. 'వి' అనునది ఉపసర్గ, కర్మార్థములో భూతకాలము లజ్ - ప్రథమ పురుష ఏకవచన రూపము -

కర్మణి ప్రయోగము గనుక ఆత్మనేపది.

17 వ వాక్యములోని 'అకథ్యత' అను క్రియయొక్క రూపముల వలె దీనికి లజ్‌లో రూపములుండును.

అజ్ఞాప్యత అజ్ఞాప్యేతామ్ అజ్ఞాప్యంత మొ॥

వాక్యము 38

విదేశ మంత్రీ ఆశాం ప్రాకటయత్. (విదేశ వ్యవహారాల మంత్రి ఆశను ప్రకటించెను) దీని లోని క్రియా పదము=ప్రాకటయత్

ప్ర+అకటయత్=ప్రాకటయత్ (ప్రకటించెను)సవర్ణదీర్ఘ సంధి.

ధాతువు "కటి=గతౌ" అనునది.

"ప్ర" అను ఉపసర్గ చేరినది.

భూతకాలము- లఙ్-ప్రథమపురుష- ఏకవచనరూపము, ప్రేరణార్థకము ఇది పరస్మైపది ధాతువు.

పై క్రియా పదమునకు లఙ్‌లో మొత్తము రూపములు —

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్రాకటయత్ | ప్రాకటయతామ్ | ప్రాకటయన్ |
| మ. పు. | ప్రాకటయః | ప్రాకటయతమ్ | ప్రాకటయత |
| ఉ. పు. | ప్రాకటయమ్ | ప్రాకటయావ | ప్రాకటయామ |

వాక్యము 39.

నవ ఢిల్ల్యాం రాజ్యముఖ్యమంత్రిణాం సమావేశః అద్య ప్రారభ్యతే.

(క్రొత్త ఢిల్లీలో రాష్ట్రముఖ్యమంత్రుల సమావేశము నేడు ప్రారంభింప బడుచున్నది)

ఇందలి క్రియాపదము= ప్రారభ్యతే (మొదలు పెట్ట బడుచున్నది.)

ప్ర+ఆ+రభ్యతే= ప్రారభ్యతే

రభ = రాభస్యే అను ధాతువు యొక్క కర్మార్థకమగు రూపము, వర్తమాన కాలము-లట్-ప్రథమపురుష-ఏకవచన మందలి రూపము. ప్ర.ఆ" అనునవి ఉపసర్గలు. మొదలుపెట్టుట అను అర్థములో సామాన్యముగా ఈ యుపసర్గలు చేరుచుండును"

ఈ వాక్యము కర్మణి ప్రయోగముగా నున్నది.

ప్రారభ్యతే ప్రారభ్యేతే ప్రారభ్యంతే ఇత్యాదిగా, శక్యతే (26వవాక్యము) అను దానికివలె లట్ రూపము లుండును.

వాక్యము 40

మూల్యవృద్ధి నిరోధాయ ప్రయత్నాః విధేయాః.

ప్రరల పరుగుదలను నిరోధించుటకు ప్రయత్నములు చేయదగ యున్నవి.

ఈ వాక్యములోని విధేయాః అనుపదము విధేయ విశేషణము. ఇది క్రియాపదమునకు బదులుగా ప్రయోగింపబడినది. కృత్ ప్రత్యయాంతమగు అకారాంత పుంలింగశబ్దము. ప్రథమావిభక్తి బహువచనమందలి రూపము.

| ఏక | ద్వి | బహు | |
|---|---|---|---|
| విధేయః | విధేయౌ | విధేయాః | ప్రథమా విభక్తి |

వాక్యము 41

ముఖ్యమంత్రిణాం సమ్మేళనం అద్యాపి "ప్రవర్తిష్యతే"

(ముఖ్యమంత్రుల సమావేశము నేడుకూడా జరుగ గలదు)

దీనిలోని క్రియాపదము=ప్రవర్తిష్యతే. జరుగగలదు అని దానియర్థము

ధాతువు– వృతు=వర్తనే; ప్ర" ఉపసర్గ. భవిష్యత్కాలము–ల్ృట్–ప్రథమపురుష–ఏకవచనరూపము.

ఈధాతువు ఆత్మనేపది.

వాక్యము కర్తరిప్రయోగములో ఉన్నది.

ల్ృట్‌లో మొత్తము రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్ర+వర్తిష్యతే | వర్తిష్యేతే | వర్తిష్యంతే |
| మ. పు. | వర్తిష్యసే | వర్తిష్యేధే | వర్తిష్యధ్వే |
| ఉ. పు | వర్తిష్యే | వర్తిష్యావహే | వర్తిష్యామహే |

ఈధాతువునకు వర్తమానకాలము(లట్)లో

వర్తతే వర్తేతే వర్తంతే

అనురీతిలో రూపములుండును: అరూపములు 35వ వాక్యము వద్ద చూపబడినవి.

వాక్యము 42

శ్రీ జయప్రకాశ నారాయణేన పాట్నానగరే రాష్ట్రియలోకసమితిః సముదఘాట్యత.

(శ్రీ జయప్రకాశనారాయణ చేత పాట్నా నగరములో జాతీయ ప్రజా సమితి ప్రారంభింపబడినది)

ఇందులోని క్రియాపదము=సముదఘాట్యత

తెరువబడెను, ప్రారంభింప బడెను అని యర్థము.

ఘట=సంఘాతే అను చురాది (10వ) గణములోని ధాతువు యొక్క రూపమిది,, కర్మార్థకమైన ప్రయోగము,"సమ్, ఉద్" అనునవిఉపసర్గలు.

భూత కాలమును బోధించు లఙ్ ప్రథమ పురుష—ఏకవచన రూపమిది.

17 వ వాక్యములోని "అకథ్యత" అను దానివలె దీనికి లఙ్ రూపము లుండును

వాక్యము 43

శ్రీ జగత్ మెహతా కలకత్తాయాం న్యగాదీత్

(శ్రీజగత్ మెహతా కలకత్తాలో వక్కాణించెను)

ఈ వాక్యములోని క్రియాపదము=న్యగాదీత్. ని+అగాదీత్=న్యగాదీత్ (మాటాడెను) యణాదేశము. ధాతువు, గద= వ్యక్తాయాంవాచి అనునది. ని అను ఉపసర్గయుక్తమగు రూపము.

భూత కాలము—లుఙ్—ప్రథమపురుష - ఏకవచన రూపమిది.

ఇది పరస్మైపది ధాతువు,, కర్తరి ప్రయోగము.

లజ్‌లోని 3 పురుషల రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ని+ అగాదీత్ | అగాదిష్టామ్ | అగాదిషుః |
| మ. పు. | అగాదీః | అగాదిష్టమ్ | అగాదిష్ట |
| ఉ. పు. | అగాదిషమ్ | అగాదిష్వ | అగాదిష్మ |

దీనికి అగదీత్, ఆగదిష్టామ్ మొ॥ హ్రస్వయుక్తములగు రూపాంతరములు కూడ కలవు.

ఈధాతువుయొక్క లజ్ రూపము "న్యగదత్" పూర్వము 30వ వాక్యములో వివరింపబడినది.

వాక్యము 44

శ్రీవాజపేయీ అద్యరాజధానీం సమాయాస్యతి.

(శ్రీవాజపేయి నేడురాజధానికి తిరిగి రాగలడు) ఇందలి క్రియాపదము, సమాయాస్యతి సమ్+ఆ+యాస్యతి. (రాగలడు)

"సమ్, ఆ" అను ఉపసర్గలతోగూడిన యా=ప్రాపణే అనుధాతువు యొక్క రూపము.

భవిష్యత్కాలము - ల్రుట్ - ప్రథమపురుష - ఏకవచనములోని రూపము, ధాతువు పరస్మైపది.

కర్తరి ప్రయోగవాక్యము.

'యా' ధాతువు కేవలముగా ఉన్నప్పుడు వెళ్లుట యను అర్థమును బోధించును. దానికి ముందు 'ఆ' అను ఉపసర్గ చేరినచో వచ్చుటయను అర్థము నిచ్చును. యాతి=వెళ్లుచున్నాడు/ది.

ఆయాతి=వచ్చుచున్నాడు/ది. ఇట్లే గమ్ ధాతువుకు కూడవర్తించును. గచ్ఛతి=వెళ్లుచున్నాడు.

ఆగచ్ఛతి=వచ్చుచున్నాడు మొద॥

పై క్రియాపదమునకు ల్రుట్‌లో సర్వపురుష రూపములిట్లుండును.

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | యాస్యతి | యాస్యతః | యాస్యంతి |
| మ. పు. | యాస్యసి | యాస్యథః | యాస్యథ |
| ఉ. పు. | యాస్యామి | యాస్యావః | యాస్యామః |

ఈ ధాతువు 2వ దగు అదాది గణములో చేరినది.

వాక్యము 45

గుజరాత్ ముఖ్యమంత్రిణా జనాః ప్రబోధితాః

(గుజరాతు ముఖ్యమంత్రిచేత జనులు ఉపదేశింపబడిరి)

ఇందలి ప్రబోధితాః అనుపదము విధేయవిశేషణము. క్రియాపదము స్థానమున ప్రయోగింపబడినది. కృదంతమైన అకారాంతపుంలింగ శబ్దము. ప్రథమావిభక్తి బహువచనరూపము.

దీనికి బదులుగా "ప్రాబుధ్యంత" అను క్రియాపదము వాడినచో. సమానార్థము నిచ్చును.

వాక్యము 46

ప్రదర్శనకారేషు వింశతిః జనాః ఆహతాః.

(ప్రదర్శన కారులందు ఇరువదిమంది చంపబడిరి)

పై వాక్యములోని ఆహతాః అను పదము విధేయవిశేషణము, క్త ప్రత్యయముతో గూడిన సుబంతము. క్రియాపదమునకు మారుగా వాడబడినది. అకారాంత పుంలింగశబ్దము. ప్రథమా విభక్తి బహువచనరూపము. కర్మణి ప్రయోగవాక్యమిది. వింశతి శబ్దము ఏకవచనములో నున్నప్పటికిని ఇరువది మందియను బహువచనార్థమును తెల్పును.

వాక్యము 47

ప్రధానమంత్రీ ఆగస్ట్ 15 తమే దినే రాష్ట్రం సంబోధయిష్యతి.

(ప్రధానమంత్రి ఆగస్టు 15వ తేదీన జాతినుద్దేశించి ప్రసంగించగలరు.

ఈ వాక్యములోని క్రియాపదము=సంబోధయిష్యతి. ఉద్దేశించి మాట్లాడుట దానియర్థము.

బుధిర్ = బోధనే అను ధాతువుయొక్క ప్రేరణార్థకరూపము, "సమ్" అనునది ఉపసర్గ.

భవిష్యత్కాలము - ల్పట్ - ప్రథమపురుష - ఏకవచన రూపము.

పరస్మైపది ధాతువు.

ఇది కర్తరి ప్రయోగ వాక్యము.

దీనికి "ల్పట్" రూపములు 22వ వాక్యములోని "ప్రసారయిష్యతి" అను క్రియాపదమునకు వలెనే యుండును.

వాక్యము 48

సర్వేమంత్రిణః విశ్వస్తాః ఆసన్.

(అందరు మంత్రులు నమ్మకము కలవారుగా నుండిరి)

ఇందలి క్రియాపదము=ఆసన్ (ఉండిరి)

అస=భువి అను ధాతువుయొక్క భూతకాలపు రూపము లఙ్-ప్రథమపురుష - బహువచనము.

ఈ ధాతువు 2వ గణములోనిది, పరస్మైపది.

దీని లఙ్ రూపములు పూర్తిగా -

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | ఆసీత్ | ఆస్తామ్ | ఆసన్ |
| మ. పు. | ఆసీః | ఆస్త | ఆస్త |
| ఉ. పు. | ఆసమ్ | ఆస్వ | ఆస్మ |

ఈ ధాతువు యొక్క లట్ రూపము "అస్తి" పూర్వము 11వ వాక్యములో వివరింపబడినది.

కొన్ని ఇతరోదాహరణములు :—

1. డా॥ రాధాకృష్ణః భారత రాష్ట్రపతిః ఆసీత్.

(డా॥ రాధాకృష్ణ భారత రాష్ట్రపతిగా ఉండెను.)

2. వయం గత సంవత్సరే మదరాస్ నగరే ఆస్మ.

(మేము గతసంవత్సరమున మదరాస్ నగరమందుంటిమి)

వాక్యము 49

విదేశమంత్రీ విశ్వసితి.

(విదేశ వ్యవహారాలమంత్రి నమ్ముచున్నాడు.)

దీనిలో క్రియాపదము=విశ్వసితి.

శ్వస=ప్రాణనే అనుధాతువుయొక్క వర్తమానకాలపు లట్ ప్రథమ పురుష - ఏకవచన రూపము "వి" అనునది ఉపసర్గ.

ఇది రెండవగణములోవి పరస్మైపది ధాతువు. కర్తరి ప్రయోగము.

దీని "లట్" రూపములు పూర్తిగా—

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. పు. | వి+ | శ్వసితి | శ్వసితః | శ్వసంతి |
| మ. పు. | | శ్వసిషి | శ్వసిథః | శ్వసిథ |
| ఉ. పు. | | శ్వసిమి | శ్వసివః | శ్వసిమః |

విశ్వస్తః, విశ్వాసః అనుశబ్దములీ ధాతువునుండి పుట్టినవి. 48 వ వాక్యములో 'విశ్వస్తాః' అను పదమునుగూర్చి వివరింపబడినది.

వాక్యము 50

శ్రీ మొరార్జిదేశాయ్ జలోపప్లవ పీడిత ప్రదేశాన్ నిరైక్షత.

(శ్రీ మొరార్జిదేశాయ్ నీటివరదలచేత పీడింపబడిన ప్రదేశములను పరిశీలించెను)

దీనిలోని క్రియాపదము=నిరైక్షత (పరిశీలించెను) ధాతువు, ఈక్ష= దర్శనే అనునది; ఆత్మనేపది.

"నిర్" అనునది ఉపసర్గ.

భూతకాలము - లఙ్ - ప్రథమ పురుష - ఏకవచన రూపము.

కర్తరిప్రయోగవాక్యము.

లఙ్ లోని సమగ్రరూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. నిర్ + | ఐక్షత | ఐక్షేతామ్ | ఐక్షంత |
| మ. పు. | ఐక్షథాః | ఐక్షేథామ్ | ఐక్షధ్వమ్ |
| ఉ. పు. | ఐక్షే | ఐక్షావహి | ఐక్షామహి |

మరికొన్ని యుదాహరణములు—

1. హనుమాన్ లంకాయాంసీతామ్ ఐక్షత.
   హనుమంతుడు లంకయందు సీతను చూచెను.

2. వయం హైదరాబాద్ నగరే చార్మినార్ నిర్మాణం ఐక్షామహి.
   (మేము హైదరాబాద్ నగరమందు చార్మినార్ కట్టడమును చూచితిమి.)

వాక్యము 51

ప్రసిద్ధ పండితః శ్రీ కాశీప్రసాదమిశ్రః గతరాత్రౌ వారాణస్యాం నిధనమ్ అగాత్.

(ప్రఖ్యాత పండితుడు శ్రీ కాశీప్రసాద మిశ్రా గతరాత్రి యందు వారణాసిలో మరణమును బొందెను.)

ఇందలి క్రియాపదము—అగాత్ (పొందెను)

ఇణ్—గతౌ అను ధాతువుయొక్క లుఙ్ ప్రథమపురుష - ఏకవచన రూపము.

పరస్మైపది ధాతువు, 2వ గణములోనిది.

"ఇణ్" ధాతువునకు లుఙ్‌లో 'గా' ఆదేశమగును.

దీనియొక్క లుఙ్ పూర్తిరూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అగాత్ | అగాతామ్ | అగుః |
| మ. పు. | అగాః | అగాతమ్ | అగాత |
| ఉ. పు. | అగామ్ | అగావ | అగామ. |

వర్తమాన (లట్) ములో –

ఏతి ఇతః యంతి మొ॥

రీతిగా రూపములుండును.

వాక్యము 52

ఢిల్ల్యాంజలోపప్లవస్థితిః భద్రతాం భజతే.

(ఢిల్లీలో వరదల పరిస్థితి క్షేమదశను పొందుచున్నది.)

ఈ వాక్యములోని క్రియాపదము—భజతే.

పొందుచున్నది యని అర్థము.

ధాతువు, భజ=సేవాయామ్ అనునది. ఉభయపది. వర్తమానకాలము - లట్ - ప్రథమపురుష - ఏకవచనరూపము.

ఈ వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

భజధాతువునకు సేవించుట, పొందుట యను రెండు అర్థములుకలవు.

ఉదా॥ సఃహరింభజతి (అతడు హరిని సేవించుచున్నాడు)

2. మనుష్యఃపుణ్యేన స్వర్గం భజతే.
(మనుష్యుడు పుణ్యముచేత స్వర్గమును పొందుచున్నాడు)

3. త్వం రాజానం భజసే (నీవు రాజును సేవించుచున్నావు) మధ్యమ పురుష ఏకవచనము.

వాక్యము 53

రాజస్థాన రాజ్యేసైనికాః సురక్షాకార్యం కుర్వంతి
(రాజస్థాన్ రాష్ట్రములో సైనికులు రక్షణచర్యను చేయుచున్నారు).

ఈ వాక్యములోని క్రియాపదము=కుర్వంతి
దానియర్థము చేయుచున్నారు అని.

ధాతువు: డుకృఞ్=కరణే (చేయుట).
తనాది (8 వ) గణములోనిది, ఉభయపది.

ప్రస్తుత రూపము—వర్తమాన కాలము - లట్ పరస్మైపది - ప్రథమ పురుష బహువచనమునకు సంబంధించినది.

వాక్యము కర్తరి ప్రయోగము

లట్ లోని మొత్తము రూపములు—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | కరోతి | కురుతః | కుర్వంతి |
| మ. పు. | కరోషి | కురుథః | కురుథ |
| ఉ. పు. | కరోమి | కుర్వః | కుర్మః |

ఇతరోదాహరణములుకొన్ని—

1 గోపాలః విద్యాభ్యాసం కరోతి

(గోపాలుడు విద్యాభ్యాసమును చేయుచున్నాడు) ప్రథ
ఏకవచనము

2 అహం వాణిజ్యంకరోమి. ఉత్తమపురుష ఏకవచనము

(నేను వ్యాపారమును చేయుచున్నాను)

3 త్వం కుత్ర ఉద్యోగం కరోషి? మధ్యమపురుష ఏకవ

(నీవు ఎక్కడ ఉద్యోగమును చేయుచున్నావు?)

ఇది ఉభయపది కనుక, దీనికి ఆత్మనేపదిలో కూడ రూపము

లట్‌లో ఆత్మనేపది రూపములివి—

| | | |
|---|---|---|
| కురుతే | కుర్వాతే | కుర |
| కురుషే | కుర్వాథే | కురు |
| కుర్వే | కుర్వహే | కుర్మ |

వాక్యము 54

కాంగ్రెస్ కార్యకారిణీ సమితిః హ్యః ఢిల్ల్యాం సంమిలితా.

(కాంగ్రెస్ కార్యవర్గము నిన్న ఢిల్లీలో సమావేశమైనది)

ఈ వాక్యములోని "సంమిలితా" అను పదము సుబంతమ
పదమునకు మారుగా ప్రయోగింప బడినది.

సంమిలితా=కలిసినది యని అర్థము.

ఇది ఆకారాంత స్త్రీలింగ శబ్దము, ప్రథమావిభక్తి ఏకవచనరూపము

దీనిని తిఙంత రూపములో 'అమిలత్' అని చెప్పవచ్చును.
పదము 7 వ వాక్యములో వివరింపబడినది.

వాక్యము 55

గతదినే బెంగుళూర్ నగరే శ్రీ చంద్రశేఖరః అభాషిష్ట.

(నిన్న బెంగుళూర్ నగరములో శ్రీ చంద్రశేఖర్ ప్రసంగించెను).

ఇందలి క్రియాపదము = అభాషిష్ట.

ధాతువు, భాష = వ్యక్తాయాం వాచి (మాటాడు)

ఆత్మనేపదిధాతువు.

భూతకాలము — లుఙ్ — ప్రథమపురుష — ఏకవచనరూపము

దీనికి లుఙ్‌లో సర్వపురుషరూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అభాషిష్ట | అభాషిషాతామ్ | అభాషిషత |
| మ. పు. | అభాషిష్ఠాః | అభాషిషాథామ్ | అభాషిధ్వమ్ |
| ఉ. పు. | అభాషిషి | అభాషిష్వహి | అభాషిష్మహి |

దీనియొక్క లఙ్ రూపము ప్ర + అభాషత అనునది 3 వ వాక్యములో వివరింపబడినది.

వర్తమాన వాచక (లట్) రూపములు—

భాషతే భాషేతే భాషంతే

మొద॥ విధముగా నుండును.

వాక్యము 56

జనతాప్రభుత్వం దుర్బలవర్గాణాం కల్యాణాయ ప్రయతిష్యతే.

జనతా ప్రభుత్వము బలహీనవర్గాలవారి క్షేమము కొరకు ప్రయత్నించ గలదు.

ఇందలి క్రియాపదము = ప్రయతిష్యతే (ప్రయత్నించగలదు)

యతీ = ప్రయత్నే అనుధాతువుయొక్క ల్ఋట్ - ప్రథమపురుష — ఏకవచన రూపము.

భవిష్యత్కాల బోధకము. కర్తరిప్రయోగము. ఇది ఆత్మనేపదిధాతువు

లృట్‌లోని సర్వరూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ప్ర + యతిష్యతే | యతిష్యేతే | యతిష్యంతే |
| మ.పు. | యతిష్యసే | యతిష్యేథే | యతిష్యధ్వే |
| ఉ. పు. | యతిష్యే | యతిష్యావహే | యతిష్యామహే |

ఈ ధాతువుయొక్క లట్ రూపములు 31 వ వాక్యములో ప్రదర్శింప బడినవి.

వాక్యము 57

దేశస్యనిర్ధనజనైః ఏవ జనతా పక్షః అధికారేనిక్షిప్తః.

(దేశముయొక్క బీదజనులచేతనే జనతాపార్టీ అధికారములో నుంచ బడినది.)

ఈ వాక్యములో నిక్షిప్తః అనునది కృదంతశబ్దము. ఇది క్రియాపద స్థానములో ప్రయోగింపబడినది. కర్మార్థక ప్రయోగమిది.

అకారాంత పుంలింగశబ్దము. ప్రథమావిభక్తి. ఏకవచనరూపము.

దీనియర్థమునందే 'న్యక్షిప్యత' అను తిఙంత రూపమును ప్రయోగింప వచ్చును.

వాక్యము 58

భారతం సాంప్రతం నిర్వ్యూహనీతిం అనుసరతి.

(భారత దేశము ప్రస్తుతము అలీనవిధానమును అనుసరించుచున్నది.)

ఈ వాక్యములోని క్రియాపదము—అనుసరతి. అనుసరతి యనగా అనుసరించుచున్నదని యర్థము.

సృ—గతౌ అనుధాతువుయొక్క వర్తమానార్థక లట్ రూపము. ప్రథమ పురుష - ఏకవచనము. పరస్మైపద ధాతువు "అను" ఉపసర్గము.

దీనికి లట్ లోని మొత్తము రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు | అను + సరతి | సరతః | సరంతి |
| మ. పు. | సరసి | సరథః | సరథ |
| ఉ. పు. | సరామి | సరావః | సరామః |

దీనికి మరికొన్ని వాక్యములు —

1. అహం ధర్మమార్గం అనుసరామి (నేను ధర్మమార్గమును అనుసరించుచున్నాను.) ఉత్తమ పురుష ఏకవచనము.

2. యూయం అన్యాయ రీతిం అనుసరథ (మీరు అన్యాయపద్ధతి నవలంబించుచున్నారు) మ. పు. బహువచనము.

3. విద్యార్థినః గురుణాం స్వభావం అనుసరంతి.
(విద్యార్థులు గురువుల స్వభావమును అనుసరించుచున్నారు.)
ప్ర. పు. బహువచనము.

వాక్యము 59

భారతం చైతన్యశీలాం విదేశ నీతిం అనుసరిష్యతి. (భారతదేశము చైతన్యశీలమగు విదేశాంగనీతిని అనుసరించగలదు.)
ఇందలి క్రియాపదము = అనుసరిష్యతి (అనుసరించగలదు.)
పూర్వవాక్యములోని ధాతువునకే ఇది భవిష్యదర్థకరూపము.
భవిష్యత్కాలము – ల్యట్ – ప్రథమపురుష – ఏకవచనరూపము.
కర్తరి ప్రయోగవాక్యము.

ల్యట్ లోని మొత్తము రూపములు –

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అను + సరిష్యతి | సరిష్యతః | సరిష్యంతి |
| మ. పు. | సరిష్యసి | సరిష్యథః | సరిష్యథ |
| ఉ. పు. | సరిష్యామి | సరిష్యావః | సరిష్యామః |

వాక్యము 60

శ్రీ వాజపేయీ స్పష్టం ఉదఘోషయత్.
(శ్రీ వాజపేయి స్పష్టముగా ప్రకటించెను)
ఇందలి క్రియాపదము = ఉదఘోషయత్ = ప్రకటించెను.

ఘుషిర్ = విశబ్దనే అను ధాతువుయొక్క రూపము. భూతకాలము - లఙ్ - ప్రథమ పురుష - ఏకవచనమునకు సంబంధించినది.

చురాది (10వ) గణములోని ధాతువు. పరస్మైపద రూపము. 'ఉత్' అనునది ఉపసర్గ.

కర్తరి ప్రయోగవాక్యము.

ధ్వనిచేయుట అను ధాత్వర్థము, ఉపసర్గ చేరుట వలన ప్రకటించుట అను అర్థమును తెలుపుచున్నది.

దీని లట్ రూపములు 5 వ వాక్యములో చూపబడిన ప్రత్యపాదయత్ అను దానికి వలె నుండును.

వర్తమానము (లట్) లో -

ఘోషయతి ఘోషయతః ఘోషయంతి

అనురీతిలో నుండును.

వాక్యము 61

బీహార్ రాజ్యపాలేన నూతన మంత్రిభిః శపథవిధా అనుష్ఠాపితా.
(బీహార్ గవర్నర్ చేత క్రొత్త మంత్రుల చేత ప్రమాణస్వీకారవిధి జరిపింపబడినది.)

పై వాక్యములోని "అనుష్ఠాపితా" శబ్దము క్రియాపదమునకు బదులుగా ప్రయోగింపబడిన సుబంతము. క్త ప్రత్యయాంతము. జరిపింపబడినది అని దాని యర్థము.

ఆకారాంత స్త్రీలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము.

వాక్యము 62

ఉత్తరప్రదేశే మృతానాం సంఖ్యా పంచదశ సంవృత్తా, (ఉత్తరప్రదేశ్‌లో చనిపోయినవారి సంఖ్య 15 అయినది).

ఈ వాక్యములోని సంవృత్తా అను పదము సుబంతము. ఇది విధేయ విశేషణము. క్రియాపదమునకు మారుగా వాడబడినది.

సంవృత్తా=అనగా 'జరిగినది', లేక 'అయినది' అని యర్థము.

ఇదికూడ ఆకారాంత స్త్రీలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము.

దీనికి సమానార్థములో 'సమవర్తత' అను తిఙంత రూపమును ప్రయోగింపవచ్చును.

వాక్యము 63

ప్రధాన మంత్రిణా సమ్మేళనమేకం ఆయోజితమ్. (ప్రధానమంత్రిచేత ఒక సమ్మేళనము ఏర్పాటు చేయబడినది.)

ఇందులోని "ఆయోజితమ్" అనుపదము సుబంతము. క్త ప్రత్యయాంత శబ్దము. క్రియాపదము స్థానమున ప్రయోగింపబడినది. ఏర్పాటు చేయబడినది అని దాని యర్థము. ధాతువులమీద కృత్ ప్రత్యయములు చేరి యేర్పడిన శబ్దములు క్రియాపదముల యర్థములను తెలుపుచుండును. కాని అవి సుబంత శబ్దములుగా ఉండును అట్టివానిలో చేరినవే 61, 62, 63 వాక్యములలోని యీ శబ్దములు, ఇంకను ఇటువంటివి కూడ.

ఆయోజితమ్=ఇది అకారాంత నపుంసకలింగశబ్దము. ప్రథమా విభక్తి ఏకవచనరూపము.

వాక్యము 64

ప్రధానమంత్రీ అన్యమాసస్య ఏకవింశతితమే దినే శ్రీ జయప్రకాశ నారాయణం సంమేలిష్యతి.

ప్రధానమంత్రి యీనెల ఇరువది ఒకటవతేదీన శ్రీ జయప్రకాశ్ నారాయణను కలుసుకొనగలరు)

దీనిలో క్రియాపదము=సంమేలిష్యతి (కలియగలరు) మిల=శ్లేషణే అనునది ధాతువు.

భవిష్యత్కాలము, లృట్ - ప్రథమపురుష - ఏకవచనరూపము. పరస్మైపది ధాతువు.

'సమ్' అను ఉపసర్గతో గూడినది.

13 వ వాక్యములోని "వ్యవహారిష్యతి" అనుదానికి వలె దీనికి లృట్ రూపములుండును.

ఇది కర్తరి ప్రయోగ వాక్యము.

ఈ ధాతువుయొక్క క్త ప్రత్యయాంతరూపము 'సంమిలితా' అనుపదము 54 వ వాక్యములో నిరూపింపబడినది.

వాక్యము 65

కేంద్రీయ మంత్రిపరిషత్ప్యాః విస్తారితా.

(కేంద్ర మంత్రిమండలి విన్న విస్తరించబడినది)

దీనిలోని "విస్తారితా" శబ్దము సుబంతము, విధేయవిశేషణము ఇది క్రియాపదమునకు బదులు ప్రయోగింపబడినది. పెంచబడినది అని దీని అర్థము.

ఆకారాంత స్త్రీలింగము. ప్రథమావిభక్తి - ఏకవచనరూపము.

వాక్యము 66

నూతన మంత్రిణః రవివారే శపథం గ్రహిష్యంతి.

(క్రొత్తమంత్రులు ఆదివారమునాడు ప్రమాణము స్వీకరింతురు)

ఇందలి క్రియాపదము=గ్రహిష్యంతి (గ్రహింపగలరు)

ఇది గ్రహ = ఉపాదానే అనుధాతువు యొక్క భవిష్యదర్థకల్ఋట్ రూపము, ప్రథమపురుష బహువచనము పరస్మైపది ధాతువు.

కర్తరిప్రయోగ వాక్యము.

13 వ వాక్యములోని "వ్యవహరిష్యతి" అను క్రియాపదము రూపముల వలెనే దీని ల్ఋట్ రూపము లుండును. గ్రహిష్యతి గ్రహిష్యతః గ్రహిష్యంతి మొదలగునవి

ఇతరోదాహరణములు:—

1 బాలకః హస్తేపుస్తకం గ్రహిష్యతి ప్ర.పు. ఏకవచనము
(బాలకుడు చేతియందు పుస్తకమును ధరింవగలడు)

2 అహంతవ వస్త్రం గ్రహిష్యామి. ఉ.పు. ఏకవచనము
(నేను నీయొక్క వస్త్రమును తీసికొనగలను)

ఈ ధాతువునకు ముందు అయా ఉపసర్గలు చేరినప్పుడు అర్థము మారుటను క్రింది కృదంతపదములలో చూడ వచ్చును.

| | ఉపసర్గ | | ధాతువు | కృదంతశబ్దము | అర్థము |
|---|---|---|---|---|---|
| 1 | ఆ | + | గ్రహ్ | ఆగ్రహః | కోపము |
| 2 | ని | + | ,, | నిగ్రహః | అణచుట |
| 3 | వి | + | ,, | విగ్రహః | కలహము |
| 4 | అను | + | ,, | అనుగ్రహః | దయ |
| 5 | అవ | + | ,, | అవగ్రహః | అనావృష్టి |
| 6 | సమ్ | + | ,, | సంగ్రహః | సేకరించుట |

ఇత్యాదులు మరికొన్ని కలవు.

వాక్యము 67

ప్రతివర్షం దశకోటి రూప్యాత్మకః అధికవ్యయః భవిష్యతి.
(ప్రతిసంవత్సరము పదికోట్లరూపాయల అదనపు ఖర్చుకాగలదు.)

ఇందలి క్రియాపదము—భవిష్యతి (కాగలదు)

భూ—సత్తాయామ్ అను ధాతువుయొక్క భవిష్యత్కాలార్థకమగు లృట్ రూపము పరస్మైపది ధాతువు. ప్రథమపురుష-ఏకవచనము

దీనిలృట్ సమగ్రరూపములు 20వ వాక్యమువద్ద చూపబడినవి. 20, 23 వాక్యములలో ద్వివచన బహువచనరూపములు వివరింపబడినవి. భూధాతువు ఉండుట అను అర్థము నందు పఠింపబడినను ఆగుట అను అర్థము నందే ఎక్కువ వాడబడుచుండును. పైవాక్యము కర్తరిప్రయోగములో నున్నది.

వాక్యము 68

అస్సాం ముఖ్యమంత్రీదేశస్య ఆర్థికాభివృద్ధ్యై ప్రయతితుంజనాన్ ఉదబోధయత్.

(అస్సాం ముఖ్యమంత్రి దేశపు ఆర్థికాభివృద్ధి కొరకు ప్రయత్నించుటకు జనులనుద్బోధించెను.)

ఈవాక్యములోని క్రియాపదము—ఉదబోధయత్ ఉత్+అబోధయత్ (ఉద్బోధించెను)

"బుధ—అవగమనే" అను ధాతువుయొక్క ప్రేరణార్థక రూపము. భూతకాల బోధకమగు లఙ్ ప్రథమపురుష ఏకవచనము. పరస్మైపదరూపము

వాక్యము కర్తరిప్రయోగములో నున్నది. 'ఉత్' అనునది ఉపసర్గ.

లఙ్‌లో దీని పూర్తి రూపములు —

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అబోధయత్ | అబోధయతామ్ | అబోధయన్ |
| మ.పు. | అబోధయః | అబోధయతమ్ | అబోధయత |
| ఉ.పు. | అబోధయమ్ | అబోధయావ | అబోధయామ |

లట్‌లో బోధయతి, బోధయతః బోధయంతి అను క్రమములో రూపములుండును.

'ప్రయతితుమ్' అనునది పైవాక్యములోని తుమున్ ప్రత్యయాంతమగు అవ్యయము. ప్రయత్నించుటకొరకు అని దాని యర్థము. ఇది ధాతుజన్యమైనప్పటికి క్రియాపదముగా గ్రహింపబడదు లింగ, విభక్తి, వచన శూన్యమైనది అవ్యయమనబడును.

వాక్యము 69

ఉపరాష్ట్రపతిః హ్యః శ్రీ అరవింద కేంద్రం సముద్ఘాటయతిస్మ.
(ఉపరాష్ట్రపతి నిన్న శ్రీ అరవిందకేంద్రమును తెరచెను)

ప్రస్తుత వాక్యములోని క్రియాపదము=సముద్ఘాటయతి సమ్+ఉత్+ఘాటయతి=సముద్ఘాటయతి.

చురాది (10వ) గణములోని 'ఘట=సంఘాతే' అను ధాతువుయొక్క లట్ రూపము వర్తమానార్థకమైనను "స్మ" అను అవ్యయముతో గూడినప్పుడు భూతార్థమును బోధించును.

లట్ లోని మొత్తము రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు | ఘాటయతి | ఘాటయతః | ఘాటయంతి |
| మ పు. | ఘాటయసి | ఘాటయథః | ఘాటయథ |
| ఉ, పు. | ఘాటయామి | ఘాటయావః | ఘాటయామః |

సమ్, ఉత్, అనురెండు ఉపసర్గలు పైరూపములకు చేర్చుకొనవలెను.

వాక్యము 70

శ్రీ అటల్ బిహారీవాజపేయీ సాంప్రతం రంగూన్ నగరే విద్యతే.
(శ్రీ అటల్ బిహారీవాజపేయి ప్రస్తుతము రంగూన్ నగరములో ఉన్నారు.
ఇందలి క్రియాపదము=విద్యతే (ఉన్నాడు)

"విద—సత్తాయామ్" అనుధాతువుయొక్క వర్తమానార్థకలట్ (
ప్రథమపురుష ఏకవచనము. ఈ ధాతువు దివాది గణములోనిది, ఆత
పై వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

ఈ క్రియకు లట్‌లో సర్వరూపములు;—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | విద్యతే | విద్యేతే | విద్య |
| మ. పు. | విద్యసే | విద్యేథే | విద్య |
| ఉ. పు. | విద్యే | విద్యావహే | విద్యా |

కొన్ని ఇతర వాక్యములు

1 అస్మాకంగ్రామే ఏకః పండితః విద్యతే ప్ర.పు. ఏక
(మాగ్రామమందు ఒక పండితుడున్నారు)

2 వయం వ్యాపారార్థం అత్ర విద్యామహే ఉ. పు. బహ
(మేము వ్యాపారము కొరకు ఇక్కడ ఉంటున్నాము)

3 త్వం సర్వదా తత్ర విద్యసే. మ.పు ఏక
(నీవు ఎల్లప్పుడు అక్కడ ఉంటున్నావు)

వాక్యము 71

పాకిస్తానీయ నిర్బంధితాన్ విమోక్తుం నిర్ణీతమ్.
(పాకిస్తానపు నిర్బంధితులను విడుచుటకు నిర్ణయింపబడినది.)

పై వాక్యములోని 'నిర్ణీతమ్' అనుపదము క్త ప్రత్యయా
సుబంతము. క్రియాపదముబదులుగా ప్రయోగింపబడినది. నిర్ణయిం
అని దాని యర్థము ఇది అకారాంత నపుంసకలింగ శబ్దము, ప్రథమ
ఏకవచనము.

విమోక్తుమ్ అనుపదము తుమున్ ప్రత్యయాంతమైన అవ్యయము. విడుచుటకు అని అర్థము. తుమున్ అను ప్రత్యయము ధాతువులమీదనే వచ్చును. గంతుమ్, కర్తుమ్ పఠితుమ్ మొ॥నవి తుమున్నంతములే.

వాక్యము 72

పశ్చిమ వంగమండలే జలోపప్లవ పీడాతః రక్షాకార్యాణి ఆదిష్టాని.

(పశ్చిమ బెంగాల్ ప్రాంతములో వరదల బాధనుండి రక్షణచర్యలు ఆజ్ఞాపింపబడినవి.)

ఈ వాక్యములోని ఆదిష్టాని అనుపదము సుబంతశబ్దము. విధేయ విశేషణముగా క్రియాపదము స్థానమున ప్రయోగింపబడినది. "ఆదిష్టాని" అనగా ఆజ్ఞాపింపబడినవి యని అర్థము.

ఇది అకారాంత నపుంసకలింగ శబ్దము. ప్రథమా బహువచనరూపము. ఇదికూడ క్త ప్రత్యయాంతరూపమే.

వాక్యము 73

శ్రీమతీ రేణుకాదేవీ హ్యః సహాయమంత్రిత్వేన శపథం ప్రతిజ్ఞాపితా.

(శ్రీమతి రేణుకాదేవి నిన్న సహాయ మంత్రిగా ప్రమాణస్వీకారము చేయింపబడినది.)

ఇందులోని 'ప్రతిజ్ఞాపితా' శబ్దము సుబంతము. క్త ప్రత్యయాంతమగు ఆకారాంత స్త్రీలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనరూపము. వాక్యములో క్రియాపదమునకు మారుగా వాడబడినదీశబ్దము.

'హ్యః' అనునది కాలవాచకమగు అవ్యయము, 'నిన్న' అని దాని యర్థము. అట్లే 'శ్వః' అనగా రేపుఅని, 'అద్య' అనగా నేడు అని యర్థములు. అవి కూడా అవ్యయములే.

వాక్యము 74

ఆవశ్యకవస్తూనాం మూల్యాని షణ్మాసాభ్యంతరే ఏవ అపచేష్యంతి.

(అత్యవసరవస్తువుల ధరలు ఆరు నెలలలోపలనే తగ్గగలవు )

ఈ వాక్యములోని క్రియాపదము=అపచేష్యంతి.

దాని యర్థము "తగ్గగలవు" అని.

చిఞ్=చయనే అను ధాతువుయొక్క భవిష్యత్కాలపు రూపము. లృట్ - ప్రథమ పురుష బహువచనము. "అప" అనునది ఉపసర్గ.

ధాతువు అర్థము ఏరుట: కాని ఉపసర్గ చేరుటవలన అర్థము మార్పు జెందినది.

దీని లృట్ రూపములు పూర్తిగా :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అప+చేష్యతి | చేష్యతః | చేష్యంతి |
| మ. పు. | చేష్యసి | చేష్యథః | చేష్యథ |
| ఉ. పు. | చేష్యామి | చేష్యావః | చేష్యామః |

ఉపచయ, అపచయ, సంచయ శబ్దములు ఈ ధాతుజన్యములే. ఇది పరస్మైపది ధాతువు.

వాక్యము 75

రాష్ట్రపతిః హ్యః తిరుమల క్షేత్రే దేవతార్చనం వ్యదధాత్.

(రాష్ట్రపతి నిన్న తిరుమల క్షేత్రమునందు దేవపూజను జరిపెను.)

ఇందలి క్రియాపదము=వ్యదధాత్.

వి+అదధాత్=వ్యదధాత్ (జరిపెను.) యణాదేశము. 'వి' అను ఉపసర్గతో కూడిన డు ధా ఞ్=ధారణ పోషణయోః అను ధాతువుయొక్క భూతకాలరూపము. లఙ్ - ప్రథమ పురుష - ఏకవచనము.

ఇది తృతీయ గణములోని ఉభయపది ధాతువు. ప్రకృతరూపము పరస్మైపదికి సంబంధించినది.

ఉపసర్గ సంబంధమువలన ధాతువునకు చేయుట యను అర్థము వచ్చినది.

దీని లఙ్ సర్వపురుష రూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | వి + అదధాత్ | అధత్తామ్ | అదధుః |
| మ. పు. | అదధాః | అధత్తమ్ | అధత్త |
| ఉ. పు. | అదధామ్ | అదధ్వ | అదధ్మ |

వర్తమాన (లట్) రూపములు

దధాతి, ధత్తః, దధతి మొ॥రీతిలో నుండును.

వాక్యము 76

బర్మా పర్యటనావసరే శ్రీ వాజపేయీ ద్వయోః నగరయోః పర్యభ్రమత్.

(బర్మా పర్యటన సమయమున శ్రీ వాజపేయి రెండు నగరములందు సంచరించెను)

ఇందలి క్రియాపదము = పరి + అభ్రమత్ = పర్యభ్రమత్ 'తిరిగెను' అని దాని యర్థము.

భ్రమ = చలనే అను ధాతువు యొక్క లఙ్ రూపము.

భూతకాలార్థము - ప్రథమపురుష - ఏకవచనము. పరస్మైపది ధాతువు పరి' అనునది ఉపసర్గ.

కర్తరి ప్రయోగవాక్యమిది.

33వ వాక్యములోని 'సమభవత్' అనుదాని రూపములవలె దీనికి లఙ్‌లో రూపములుండును.

భ్రమణమ్. పరిభ్రమణమ్, భ్రమః ఇత్యాది శబ్దములీ ధాతుజన్యములే.

వాక్యము 77

జనతా పక్షస్య కార్యకారిణీ సమితిః దళత్రయే విభజ్యతే.

(జనతాపార్టీ కార్యవర్గము మూడు ఉపసంఘాలుగా విభజింపబడు చున్నది.)

ఇందలి క్రియాపదము=విభజ్యతే (విభజింపబడుచున్నది). ధాతువు, భంజో=ఆమర్దనే అనునది. "వి" ఉపసర్గ సహితము, కర్మార్థకవర్తమానకాల లట్ రూపము. ప్రథమ పురుష - ఏకవచనము,

ఆత్మనేపద రూపము.

లట్ సంపూర్ణ రూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | వి=భజ్యతే | భజ్యేతే | భజ్యంతే |
| మ. పు. | భజ్యసే | భజ్యేథే | భజ్యధ్వే |
| ఉ. పు. | భజ్యే | భజ్యావహే | భజ్యామహే |

ఇది రుధాది (7వ) గణములోని ధాతువు.

కర్త్రర్థములో లట్ రూపము లిట్లుండును.

| | | |
|---|---|---|
| భనక్తి | భంక్తః | భంజంతి |
| భనక్షి | భంక్థః | భంక్థ |
| భనజ్మి | భంజ్వః | భంజ్మః |

వాక్యము 78

మదరాస్ రాజభవనే రాష్ట్రపతినా మహాత్మగాంధినః చిత్రపట మావిష్కృతమ్.

(మదరాస్ రాజభవనమందు రాష్ట్రపతిచేత గాంధీమహాత్ముని చిత్ర పటము ఆవిష్కరింపబడినది )

పై వాక్యములోని "ఆవిష్కృతమ్" అను శబ్దము కృదంతమైన శబ్దము. క్రియాపద స్థానమున ప్రయోగింపబడినది. 'ఆవిస్' అను అవ్యయముతో కృతమ్ అను శబ్దము చేరగా తెరువబడుట అను అర్థము వచ్చును. (Unvieled)

ఇది అకారాంత నపుంసకలింగశబ్దము - ప్రథమావిభక్తి- ఏకవచనము.

వాక్యము 79

ప్రధానమంత్రిణా శ్రమికేభ్య నివేదితమ్.

(ప్రధానమంత్రిచేత కార్మికులకొరకు విజ్ఞప్తి చేయబడినది).

ఇందలి 'నివేదితమ్' అను పదము సుబంతము. క్త ప్రత్యయాంతమగు కృదంత రూపము.

క్రియాపదము యొక్క అర్థమును బోధించుచు దానికి బదులుగా వాడబడినది అకారాంత నపుంసకలింగ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము.

దీనిని కర్తరి ప్రయోగముగా చెప్పవలెనన్నచో—

ప్రధానమంత్రీ శ్రమికేభ్యః నివేదితవాన్ అని చెప్పవలెను.

తిజంతముగా చెప్పదలచినచో, న్యవేదయత్ అని చెప్పవలెను.

వాక్యము 80

అధునా తైః అపిస్వకర్తవ్యమ్ అనుష్ఠేయమ్.

(ఇప్పుడు వారిచేత గూడ తమకర్తవ్యము నెరవేర్చదగినది)

ఈ వాక్యములోని "అనుష్ఠేయమ్" అను శబ్దము కృదంతము. క్రియాపదము అర్థమును బోధించు సుబంతము. చేయదగినది అని దాని యర్థము.

ఇది అకారాంత నపుంసకలింగ శబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము.

'కర్తవ్యమ్' అను పదము కూడ కృధాతువు మీద తవ్యప్రత్యయము రాగా యేర్పడిన కృదంతరూపము.

క్రిందటి రెండు వాక్యములందలి ఆవిష్కృతమ్, నివేదితమ్, అను శబ్దములు మరియు ప్రస్తుత వాక్యమందలి అనుష్ఠేయమ్ అను పదముకూడ విశేషణములు కనుక అవి మూడు లింగములలో నుండును.

| | పుం. | స్త్రీ. | నపుం. |
|---|---|---|---|
| 1 | ఆవిష్కృతః | ఆవిష్కృతా | ఆవిష్కృతమ్ |
| 2 | నివేదితః | నివేదితా | నివేదితమ్ |
| 3 | అనుష్ఠేయః | అనుష్ఠేయా | అనుష్ఠేయమ్ |

విశేష్యముల లింగముననుసరించి యీ శబ్దము లాయాలింగములలో ండును.

వాక్యము 81

శ్రీరామకృష్ణహెగ్డే వార్తాహరాన్ సమసూచయత్.

(శ్రీ రామకృష్ణహెగ్డే పత్రికావిలేఖరులకు సూచించెను)

ఈ వాక్యములోని క్రియాపదము=సమసూచయత్. 'సమ్' అను ఉపసర్గతోగూడిన సూచ=పైశున్యే అనుధాతువు యొక్క రూపము. ఇది చురాది (10వ) గణములోని ధాతువు.

భూతకాలబోధకమగు లఙ్ రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | సమ్+అసూచయత్ | అసూచయతామ్ | అసూచయన్ |
| మ. పు. | అసూచయః | అసూచయతమ్ | అసూచయత |
| ఉ. పు. | అసూచయమ్ | అసూచయావ | అసూచయామ |

దీనికి వర్తమాన (లట్) రూపములు, సూచయతి సూచయతః సూచయంతి ఇత్యాదిగానుండును.

వాక్యము 82

విదేశమంత్రీ చతుర్దివసీయ బర్మా పర్యటనానంతరం నవఢిల్లీం ప్రత్యాగచ్ఛత్

(విదేశాంగమంత్రి నాలుగురోజుల బర్మా పర్యటన తరువాత కొత్త ఢిల్లికి తిరిగి వచ్చినాడు)

ఇందలి క్రియాపదము = ప్రత్యాగచ్ఛత్.

ప్రతి + ఆగచ్ఛత్ = ప్రత్యాగచ్ఛత్ (తిరిగివచ్చెను) యణాదేశసంధి

గమ్ = గతౌ అనుధాతువుయొక్క లఙ్, ప్రథమపురుష ఏకవచనరూపము భూతకాల బోధకము. పరస్మైపదిధాతువు. భ్వాదిగణములోనిది.

గమ్ = ధాతువునకు 4 లకారములలో గచ్ఛ అను ఆదేశమువచ్చును.

వర్తమానములో

| | | |
|---|---|---|
| గచ్ఛతి | గచ్ఛతః | గచ్ఛంతి |

అని 8 వవాక్యములోని 'ఆరోహతి' అనుదానికివలె రూపములుండును. దీనికి ముందు 'ఆ' ను చేర్చినచో వచ్చుట అను అర్థము కలుగును.

గచ్ఛతి = వెళ్లుచున్నాడు/ది

ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు/ది

దీనిలఙ్ సంపూర్ణ రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ప్రతి + ఆ + అగచ్ఛత్ | అగచ్ఛతామ్ | అగచ్ఛన్ |
| మ.పు. | అగచ్ఛః | అగచ్ఛతమ్ | అగచ్ఛత |
| ఉ.పు. | అగచ్ఛమ్ | అగచ్ఛావ | అగచ్ఛామ |

మరికొన్ని ఉదాహరణ వాక్యములు:—

1 త్వం అత్ర కదా ఆగచ్ఛః? మ పు. ఏకవచనము
(నీవు ఇక్కడికి ఎప్పుడు వచ్చితివి?)

2 అహం హ్యః తత్ర ఆగచ్ఛమ్ ఉ పు. ఏక
(నేను నిన్న అక్కడికి వచ్చితిని)

3 రామః మిథిలాం అగచ్ఛత్. ప్ర పు. ఏక
(రాముడు మిథిలకు వెళ్ళెను). "అ" లేకుండా

వాక్యము 83

భారతీయేభ్యః అహింసావిధానమేవరోచతే

(భారతీయుల(కొర)కు అహింసావిధానమే ఇష్టముగును)

ఇందలి క్రియాపదము=రోచతే (ఇష్టముగును)

రుచ=అభిప్రీతౌ అనుధాతువుయొక్క వర్తమానకాల రూపము. లట్ ప్రథమ పురుష ఏకవచనము ఆత్మనేపదిధాతువు. కర్తరిప్రయోగవాక్యము.

దీనిలట్ సంపూర్ణరూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | రోచతే | రోచేతే | రోచంతే |
| మ పు. | రోచసే | రోచేథే | రోచధ్వే |
| ఉ.పు. | రోచే | రోచావహే | రోచామహే |

ఈధాతువుతో అన్వయించు పదము వ్యాకరణము ప్రకారము చతుర్థీవిభక్తిలో నుండవలెను. కనుక భారతీయేభ్యః అని చతుర్థీవిభక్తిరూపము వాడబడినది.

వాక్యము 84

ప్రశాసనాధికారిణః జనసేవాలక్ష్యం స్వీకుర్యుః ఇతి ప్రధానమంత్రీ అవదత్.

(ప్రభుత్వాధికారులు ప్రజాసేవ అనెడు లక్ష్యమును స్వీకరింపవలెను అని ప్రధానమంత్రి పలికెను)

ఈవాక్యములో స్వీకుర్యుః, అవదత్ అనురెండు క్రియాపదములు కలవు

1 స్వీకుర్యుః :— ఇది స్వశబ్దముమీద చ్వి ప్రత్యయము వచ్చి దానితో గూడిన డుకృఞ్ — కరణే అనుధాతువుయొక్క రూపము. విధ్యర్థమందు లిఙ్ ప్రథమపురుష బహువచనము. ఉభయపదియగు దాతువుయొక్క పరస్మైపది రూపము. చేయుట యని ఈ ధాతువునర్థము. కాని స్వీ + కృధాతువు కలిసి నచో స్వీకరించుట, గ్రహించుటయను అర్థము వచ్చును.

లిఙ్ రూపములు —

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు | స్వీ + కుర్యాత్ | కుర్యాతామ్ | కుర్యుః |
| మ.పు. | కుర్యాః | కుర్యాతమ్ | కుర్యాత |
| ఉ.పు. | కుర్యామ్ | కుర్యావ | కుర్యామ |

2 అవదత్:— వద — వ్యక్తాయాంవాచి అనుధాతువు యొక్క భూత కాల బోధకమగు లఙ్ రూపము. ప్రథమపురుష ఏకవచనము. పరస్మైపది ధాతువిది. దీనియొక్క లఙ్ రూపములు 7వ వాక్యములోని "అమిలత్" అను దాని రూపములవలె నుండును.

లట్‌లో ఏకవచన బహువచనరూపములు

| | | |
|---|---|---|
| 1. | వదతి (చెప్పుచున్నాడు/ది) | వదంతి (చెప్పుచున్నారు) |
| 2 | వదసి (చెప్పుచున్నావు) | వదథ (మీరుచెప్పుచున్నారు) |
| 3 | వదామి (చెప్పుచున్నాను) | వదామః (చెప్పుచున్నాము) |

వాక్యము 86

శ్రీ మొరార్జీ దేశాయ్ హ్యః పాట్నానగరే శ్రీజయప్రకాశ నారాయణేన సహ ఏకహోరా పర్యంతం సంభాషణం అకరోత్.

(శ్రీ మొరార్జీదేశాయ్ నిన్న పాట్నానగరమందు శ్రీ జయప్రకాశ నారాయణతో ఒక గంటసేపు సంభాషణ జరిపెను.)

ఇందలి క్రియాపదము = అకరోత్ (చేసెను)

ధాతువు, డు కృఞ్ = కరణే అనునది.

భూతకాల బోధకమగు లఙ్ ప్రథమ పురుష ఏకవచన రూపము. ధాతువు ఉభయపది, ఇది పరస్మైపద రూపము.

దీని లఙ్ రూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అకరోత్ | అకురుతామ్ | అకుర్వన్ |
| మ. పు. | అకరోః | అకురుతమ్ | అకురుత |
| ఉ. పు. | అకరవమ్ | అకుర్వ | అకుర్మ |

కొన్ని ఇతర వాక్యములు :-

1. అర్జునః ద్రోణాచార్యేణ యుద్ధం అకరోత్.
   (అర్జునుడు ద్రోణాచార్యునితో యుద్ధము చేసెను)
   ప్ర. పు. ఏకవచనము.

2. త్వం విద్యాభ్యాసం కుత్ర అకరోః?
   (నీవు విద్యాభ్యాసము నెక్కడ చేసితివి?) మ. పు. ఏకవచనము.

ఈ ధాతువునకు లట్‌లో, — పరస్మైపద రూపములు

కరోతి కురుతః కుర్వంతి మొ॥నవి.

మరియు ఆత్మనేపదరూపములు కురుతే, కుర్వాతే కుర్వతే మొ॥ నవి 53వ వాక్యములో ప్రదర్శింపబడినవి.

కర్తా, కారకః, కర్తుమ్, కరణమ్ వంటి రూపములీ ధాతువునుండి పుట్టిన శబ్దములు.

వాక్యము 86

ప్రధానమంత్రిణా జనాః ప్రచోదితాః

(ప్రధానమంత్రిచేత ప్రజలు ప్రేరేపింపబడినారు.)

పై వాక్యములోని ప్రచోదితాః అను శబ్దము క్రియాపదము స్థానమున ప్రయోగింపబడిన సుబంతము. క్త ప్రత్యయము చేరిన రూపమిది,

అకారాంత పుంలింగ శబ్దము ప్రథమావిభక్తి బహువచనరూపము. కర్మణి ప్రయోగవాక్యము.

వాక్యము 87

హరిజన పీడకాః ఏతాదృశ ఘటనాః నైవ ఘటితవ్యాః

(హరిజనులను పీడించు ఇటువంటి సంఘటనలు జరుగరానివి)

ఈ వాక్యములోని 'ఘటితవ్యాః' అను శబ్దము తవ్యప్రత్యయాంతమగు విశేషణ వాచకము. క్రియాపదము యొక్క స్థానములో ప్రయోగింపబడినది.

ఇది ఆకారాంత స్త్రీ లింగశబ్దము, ప్రథమా బహువచనరూపము.

వాక్యము 88

మాసత్రయాంతరేఏవ రైల్వేమండలం పునః రచయిష్యతే.

(మూడు నెలల లోపుననే రైల్వేబోర్డు పునర్నిర్మాణము జరుగగలదు,)

ఇందలి క్రియాపదము = రచయిష్యతే.

రచ = ప్రతియత్నే అను ధాతువుయొక్క రూపము. భవిష్యదర్థక లృట్ ప్రథమ పురుష – ఏకవచన రూపమిది. చురాది ఆత్మనేపది ధాతువు.

దీని ల్యృట్ రూపములు 9వ వాక్యములోని 'అయోజయిష్యతే' అను క్రియకువలె నుండును.

వర్తమానకాలములో రచయతి రచయతః రచయంతి ఇత్యాదిగా రూపము లుండును.

వాక్యము 89

ప్రధానమంత్రీ. శ్వః భారత దౌత్యాధికారిణాం సమ్మేళనస్య ఉద్ఘాటనం విధాస్యతి.

(ప్రధానమంత్రి రేపు భారత రాయబారుల సమ్మేళనము యొక్క ప్రారంభమును జరుపగల(రు)డు)

ఇందలి క్రియాపదము=విధాస్యతి (చేయగలడు)

ధాతువు = డుధాఞ్ = ధారణపోషణయోః. "వి" అను ఉపసర్గ యుక్తమగు భవిష్యదర్థక ల్యృట్ ప్రథమపురుష - ఏకవచనరూపము. ఈ ధాతువునకు ధరించుట, పోషించుట అర్థములు కాని "వి" చేరినప్పుడు చేయుట అను నర్థము బోధింపబడును. ఇది ఉభయపది ధాతువు. ప్రస్తుత రూపము పరస్మైపదికి సంబంధించినది. కర్తరి ప్రయోగము.

ల్యృట్ రూపములు :—

| | | | | |
|---|---|---|---|---|
| ప్ర. పు. | వి+ | ధాస్యతి | ధాస్యతః | ధాస్యంతి |
| మ. పు. | | ధాస్యసి | ధాస్యథః | ధాస్యథ |
| ఉ. పు. | | ధాస్యామి | ధాస్యావః | ధాస్యామః |

దీనియొక్క లఙ్ రూపము 'వ్యదధాత్' అనునది 75వ వాక్యమువద్ద వివరింపబడినది.

వాక్యము 90

ఆగ్నేయాసియాదేశైః సహ అస్మాకం సాంస్కృతిక సంబంధః దృఢతరం విధీయంతామ్

(ఆగ్నేయాసియా దేశములతో కూడ మన యొక్క సాంస్కృతిక సంబంధములు మిక్కిలి దృఢములు చేయబడవలెను)

దీనిలోని క్రియాపదము = విధీయంతామ్

ఇది పూర్వ (89) వాక్యమందలి ధాతువుయొక్క కర్మార్థకరూపము. విధ్యర్థములో లోట్ ప్రథమ పురుష బహువచనము. ఆత్మనే పద రూపము:

విధ్యర్థములో లిఙ్, లోట్ అను రెండు లకారములు వచ్చును. ఇది లోట్ రూపము.

విధీయతామ్ విధేయేతామ్ విధీయంతామ్

అని ప్రథమ పురుషలో దీని పూర్తి రూపములు.

వాక్యము 91

జనతాదళేన పంచదశసదస్యాత్మికా ఆర్థిక సమితిః వ్యవస్థాపితా.

(జనతాపార్టీచేత 15 మంది సభ్యులతోగూడిన ఒక ఆర్థిక సంఘము నెలకొల్ప బడినది)

ఈవాక్యములోని "వ్యవస్థాపితా" శబ్దము కృదంతమైన విశేషణము. క్రియాపదము యొక్క అర్థమును చెప్పుచున్న సుబంతమిది.

ఆకారాంత స్త్రీలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము. కర్మార్థములో క్త ప్రత్యయము వచ్చి యేర్పడిన శబ్దమిది.

వాక్యము 92

సంపత్సదస్యేన శ్యామసుందరగుప్తేన అభ్యర్థితమ్

(పార్లమెంటు సభ్యుడైన శ్యామసుందరగుప్త చేత కోరబడినది)

అభ్యర్థితమ్ = కోరబడినది

పై వాక్యములోని "అభ్యర్థితమ్" అనుశబ్దము, కృత్ ప్రత్యయమగు క్త ప్రత్యయము అంత మందున్న సుబంతము. ఇది క్రియాపదమువలె వాక్యమున

పూర్తిచేయుచు క్రియార్థమును చెప్పుచున్నది. దీనిలోగూడ కర్మార్థములోనే క్త ప్రత్యయము చేరినది. ఇది అకారాంత నపుంసకలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచనరూపము.

ఈయర్థములో తిజంతరూపము అభ్యార్థ్యత అని చెప్పనలసియుండును.

వాక్యము 93

బన్సీలాలం ఆగామి మాసస్య పంచమదినాంక పర్యంతం నిర్బంధేస్థాపయితుంన్యాయాధీశః సమాదిశత్. (బన్సీలాల్‌ను రాబోవునెల 5వ తేదీవరకు నిర్బంధంలో ఉంచుటకు న్యాయమూర్తి ఆజ్ఞాపించెను )

పై వాక్యములోని క్రియాపదము = సమాదిశత్
సమ్ + ఆ + అదిశత్ = సమాదిశత్ (ఆజ్ఞాపించెను)

దిశ = అతిసర్జనే అను ధాతువుయొక్క భూతకాలార్థబోధకమగు లఙ్ ప్రథమపురుష-ఏకవచన రూపము. ధాత్వర్థము = ఇచ్చుట; కాని 'ఆ' అను ఉపసర్గతో చేరినప్పుడు ఆజ్ఞాపించుట యను నర్థము నిచ్చును. పరస్మైపది ధాతువు.

దీని లఙ్ రూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | సమా + అదిశత్ | అదిశతామ్ | అదిశన్ |
| మ.పు. | అదిశః | అదిశతమ్ | అదిశత |
| ఉ.పు. | అదిశమ్ | అదిశావ | అదిశామ |

"స్థాపయితుమ్" అను పదము తుమున్ ప్రత్యయాంతమైన అవ్యయము. ఉంచుటకు, నెలకొల్పుటకు ఆని దాని యర్థము. ప్రేరణార్థకమందున్న స్థా ధాతువునుండి నిష్పన్నమైనదీ అవ్యయము.

వాక్యము 94

హ్యః నవఢిల్ల్యాం కాంగ్రెస్ కార్యకారిణీ సమిత్యాదేశస్య రాజకీయ స్థితిః పర్యాలోచితా.

(నిన్న క్రొత్తఢిల్లీలో కాంగ్రెస్ కార్యవర్గము చేత దేశపు రాజకీ పరిస్థితి ఆలోచింపబడినది)

ప్రస్తుత వాక్యములోని "పర్యాలోచితా" అను పదము క్రియాపదమ బదులుగా ప్రయోగించిన సుబంత శబ్దము. కర్మార్థములో క్త ప్రత్యం చేరినది.

ఆకారాంత స్త్రీలింగశబ్దము. ప్రథమావిభక్తి ఏకవచన రూపము.

వాక్యము 95

శ్రీ బ్రహ్మానందరెడ్డిః అధ్యక్షస్థానం అలంకృతవాన్.

(శ్రీ బ్రహ్మానందరెడ్డి అధ్యక్షస్థానమునలంకరించెను.)

ఈ వాక్యములోని "అలంకృతవాన్" అను పదము సుబంతము. క్త ప్రత్యయాంతమగు విశేషణము. ధాతువుమీద కర్త్రర్థములో క్తవతు ప్ర యము వచ్చును. 'అలమ్' అను అవ్యయముతో కృధాతువు చేరినప భూషించుట అను అర్థము వచ్చును. ఇది తకారాంత పులింగశబ్దము. ప్రథమ విభక్తి ఏకవచనము.

అలంకృతవాన్     అలంకృతవంతౌ     అలంకృతవంతః

అని ప్రథమా విభక్తి రూపములుండును.

వాక్యము 96

శ్రీలంకాద్వీపే దౌర్జన్యఘటనా విరోధాయ యత్నాః క్రియంతే.

(శ్రీలంక ద్వీపములో దౌర్జన్యచర్యల నాపుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి)

ఇందలి క్రియాపదము = క్రియంతే (చేయబడుచున్నవి)

డుకృఞ్ = కరణే అను ధాతువుమీద కర్మార్థమున ప్రత్యయమువచ్చిన రూపము.

వర్తమానకాలము-లట్-ప్రథమపురుష బహువచనము కర్మార్థము కనుక ఆత్మనేపద ప్రత్యయములు చేరును.

లట్ లోని సర్వరూపములు:-

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | క్రియతే | క్రియేతే | క్రియంతే |
| మ.పు. | క్రియసే | క్రియేథే | క్రియధ్వే |
| ఉ. పు. | క్రియే | క్రియావహే | క్రియామహే |

మరి కొన్ని యితరవాక్యములు —

1 మయాపుస్తక రచనం క్రియతే. ప్ర.పు. ఏక
(నాచేత పుస్తక రచన చేయబడుచున్నది)

2 త్వయాదేవపూజాః క్రియంతే. ప్ర.పు. బహు
(నీచేత దేవపూజలు చేయబడుచున్నవి)

3 త్వం పరీక్షాయా ముత్తీర్ణః క్రియసే. మ.పు. ఏక
(నీవు పరీక్షయందు త్తీర్ణుడవు చేయబడుచున్నావు)

వాక్యము 97

భారతం చీనాదేశేన సహమైత్రీం ఇచ్ఛతి.

(భారత దేశము చీనాదేశముతో స్నేహమును కోరుచున్నది.)

ఈ వాక్యములోని క్రియాపదము = ఇచ్ఛతి (కోరుచున్నది)

ఇది ఇష = ఇచ్ఛాయామ్ అనుదాతువుయొక్క వరమానార్థక లట్ ప్రథమ పురుష-ఏకవచనరూపము.

పరస్మైపది ధాతువు. కర్తరిప్రయోగవాక్యము.

ఈధాతువుయొక్క లట్ రూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర పు. | ఇచ్ఛతి | ఇచ్ఛతః | ఇచ్ఛంతి |
| మ. పు. | ఇచ్ఛసి | ఇచ్ఛథః | ఇచ్ఛథ |
| ఉ. పు. | ఇచ్ఛామి | ఇచ్ఛావః | ఇచ్ఛామః |

వాంఛతి, అభిలషతి, కామయతే అనునవి దీనికి సమానార్థకములగు క్రియలు.

వాక్యము 98

దుర్బలవర్గా అపితుష్టి ప్రదజీవనం యాపయేయుః

(బలహీనవర్గములవారుకూడా తృప్తికరమైన జీవితమును గడుపవలెను)

ఇందలి క్రియాపదము — యాపయేయుః
గడుపవలెను అని దాని యర్థము.

"యా — ప్రాపణే" అను ధాతువుయొక్క ప్రేరణార్థకవిధిలిఙ్ ప్రథమ పురుష బహువచన రూపము. ఇది పరస్మైపది ధాతువు. కర్తరి ప్రయోగము.

దీని విధిలిఙ్ సర్వరూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | యాపయేత్ | యాపయేతామ్ | యాపయేయుః |
| మ పు. | యాపయేః | యాపయేతమ్ | యాపయేత |
| ఉ. పు. | యాపయేయమ్ | యాపయేవ | యాపయేమ |

దీని వర్తమానరూపములు యాపయతి, యాపయతః యాపయంతి ఇత్యాది గానుండును. ప్రేరణార్థకము కానపుడు (స్వార్థకమున)
యాతి యాతః యాంతి మొదలగునవి వర్తమానార్థరూపములు.

వాక్యము 99

ఇయం యోజనా పంచవర్షేషు పూర్ణతాం ఆపత్స్యతే.

(ఈ ప్రణాళిక 5 సంవత్సరములలో పూర్ణతను పొందగలదు)

ఈవాక్యమునందలి క్రియాపదము=ఆపత్స్యతే. దానియర్థము, "పొంద గలదు" అని

'పద=గతౌ' అను ధాతువుయొక్క భవిష్యత్కాల బోధకమైన ల్ఋట్ ప్రథమపురుష ఏకవచన రూపము. ఇది దివాది గణములోని ఆత్మనేపదిధాతువు

'ఆ' అనునది ఉపసర్గ.

ల్ఋట్ లోని మొత్తము రూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ఆ+పత్స్యతే | పత్స్యేతే | పత్స్యంతే |
| మ.పు. | పత్స్యసే | పత్స్యేథే | పత్స్యధ్వే |
| ఉ.పు. | పత్స్యే | పత్స్యావహే | పత్స్యామహే |

దీనికి లట్ లో పద్యతే పద్యేతే పద్యంతే అనురీతిలో రూపములుండును'

వాక్యము 100

ప్రశాసనం ఆగామి మాసావధౌ ఇక్షుమూల్యం నిర్ధారయిష్యతి.

(ప్రభుత్వము రాబోవు నెల గడువులోపల చెరకుధరను నిర్ణయించగలదు)

ఇందులోని క్రియాపదము=నిర్ధారయిష్యతి నిర్ణయించగలదు అని దానియర్థము. ధృఞ్=ధారణె అనుధాతువుయొక్క ప్రేరణార్థమందలి భవిష్యత్కాలరూపము. నిర్ అనునది ఉపసర్గ ల్ఋట్ ప్రథమపురుష ఏకవచనము. ధాతువు పరస్మైపది. పైవాక్యము కర్తరి ప్రయోగములో ఉన్నది.

22 వ వాక్యములోని "ప్రసారయిష్యతి" అను క్రియాపదము యొక్క రూపములవలె దీని లృట్ రూపములుండును.

ధాతువునకు సహజమగు అర్థము ధరించుట. కాని 'నిర్' తో చేరి నప్పుడు నిర్ణయించుట అను అర్థమును బోధించును.

వాక్యము 101

**అమరనాథ క్షేత్రే శ్వః అశేషజనాః శివలింగస్య దర్శనం కరిష్యంతి.**

(అమరనాథ క్షేత్రములో రేపు సమస్తజనులు శివలింగముయొక్క దర్శనము చేయగలరు.)

ఈ వాక్యములోని క్రియాపదము=కరిష్యంతి. 'కరిష్యంతి' అనగా చేయగలరు అని యర్థము డుకృఞ్=కరణే అను ధాతువుయొక్క భవిష్యత్కాల సూచకమగు లృట్ ప్రథమపురుష బహువచన రూపము. ఇది ఉభయపది ధాతువు. ప్రస్తుతరూపము పరస్మైపదమునకు చెందినది.

53 వ వాక్యములో ఈ ధాతువుయొక్క లట్ రూపములు వివరింపబడినవి

దీని 'లృట్' సర్వరూపములు—

| | | | |
|---|---|---|---|
| ప్ర పు. | కరిష్యతి | కరిష్యతః | కరిష్యంతి |
| మ పు. | కరిష్యసి | కరిష్యథః | కరిష్యథ |
| ఉ. పు. | కరిష్యామి | కరిష్యావః | కరిష్యామః |

ఇవి పరస్మైపద రూపములు.

ఆత్మనేపదములో కరిష్యతే మొ॥ రూపములు 56 వ వాక్యములోని 'ప్రయతిష్యతే' అనుదాని రూపములవలె నుండును.

వాక్యము 102

**అస్మిం రాజ్యే నద్యః పూర్ణతయా ప్రవహంతి**

(అస్సాంరాష్ట్రములో నదులు నిండుగా ప్రవహించుచున్నవి)

పైవాక్యములోని క్రియాపదము = ప్రవహంతి

"ప్రవహించుచున్నవి" అని దాని యర్థము.

"వహ = ప్రాపణే" అను ధాతువుయొక్క వర్తమానార్థకరూపము 'ప్ర' అను ఉపసర్గతో గూడినది లట్ ప్రథమపురుష బహువచన రూపము.

మోయుట అనునది యీ ధాతువుయొక్క సహజమైన అర్థము. 'ప్ర'తో చేరినప్పుడు పారుట (ప్రవహించుట) అను అర్థమును బోధించును.

వహతి	వహతః	వహంతి

మొ॥"లట్" రూపములు 32 వవాక్యములోని క్రియా పదమునకు వలె ఉండును

ఇది పరస్మైపది ధాతువు. వాక్యము కర్తరి ప్రయోగములో ఉన్నది.

వాక్యము 103

శ్రీ దండావతే పశ్చిమ వంగ ముఖ్యమంత్రిణా సహ మంత్ర యిష్యతే.

(శ్రీ దండావతే పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రితో సమాలోచన జరుపగలడు)

దీని లోని క్రియా పదము = మంత్ర యిష్యతే.

మంత్రయిష్యతే = ఆలోచనము జరుపగలడు అని యర్థము. "మన్త్రి = గుప్తభాషణే" అను ధాతువు యొక్క భవిష్యత్కాలవాచకము; ల్ఋట్ ప్రథమ పురుష-ఏక వచన రూపము. ఈధాతువు ఆత్మనేపది.

వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

దీనియొక్క ల్ఋట్ రూపములు 9వ వాక్యములోని "ఆయోజయిష్యతే" అను పదమునకు వలెనుండును. లట్‌లో మంత్రయతే మంత్రయేతే మంత్రయంతే ఇత్యాదిగా ఉండును. ఇది చురాది (10వ) గణములోని ధాతువు.

వాక్యము 104

మూల్యవృద్ధిం వ్యవకలయితుం ఆవశ్యకాః నియమాః సత్వరం ప్రయోక్ష్యంతే.

(ధరల పెరుగుదలను తగ్గించుటకు అవసరమగు నియమాలు త్వరగా ప్రయోగింపబడగలవు.)

ఈ వాక్యములోని క్రియాపదము=ప్రయోక్ష్యంతే. అర్థము, ప్రయోగింపబడగలవు అని.

"యుజిర్ = యోగే" అను ధాతువుయొక్క కర్మార్థకరూపము. భవిష్యత్కాలము. ఌట్ ప్రథమపురుష బహువచనము. ఆత్మనేపద ధాతురూపము.

"ప్ర" అనునది ఉపసర్గ.

దీని ఌట్ రూపములు.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్ర+ యోక్ష్యతే | యోక్ష్యేతే | యోక్ష్యంతే |
| మ. పు. | యోక్ష్యసే | యోక్ష్యేథే | యోక్ష్యధ్వే |
| ఉ. పు. | యోక్ష్యే | యోక్ష్యావహే | యోక్ష్యామహే |

వ్యవకలయితుమ్ అనునది యీ వాక్యములోని తుమున్నంతమగు అవ్యయము. తగ్గించుటకు అని దానికర్థము.

వాక్యము 105

బళ్ళారి మండలే అశోక శిలాశాసనం సమవాప్తమ్.

(బళ్ళారి జిల్లాలో అశోకుని శిలాశాసనము దొరికినది.)

పై వాక్యములోని "సమవాప్తమ్" అను పదము క్త ప్రత్యయాంతమగు సుబంతశబ్దము, క్రియకు బదులుగా ప్రయోగింపబడినది. పొందబడినది (దొరికినది) అని ఆమాట కర్థము.

కర్మణి ప్రయోగవాక్యమిది.

సమవాప్తమ్ ఇది అకారాంత నపుంసకలింగశబ్దము. ప్రథమావిభక్తి - ఏకవచన రూపము.

సమవాప్తమ్ సమవాప్తే సమవాప్తాని

అనునవి ప్రథమావిభక్తి రూపములు.

వాక్యము 106

బన్సీలాలః స్వనిర్బంధ సమయే అమర్యాద ప్రవృత్తింప్రతి ప్రధాన మంత్రిణః సకాశేపర్యదేవయత్.

(బన్సీలాల్ తన నిర్బంధ సమయములో జరిగిన అమర్యాద ప్రవర్తనను గూర్చి ప్రధానమంత్రిపద్ద మొరపెట్టుకొనెను.)

ఇందలి క్రియాపదము=పర్యదేవయత్=పర్యదేవయత్ (మొరపెట్టు కొనెను) యణాదేశసంధి.

"దివు=మర్దనే" అను చురాది గణములోని ధాతువు యొక్క లఙ్ - ప్రథమపురుష - ఏకవచనరూపము. భూతకాలబోధకము. పరస్మైపదధాతు రూపము.

లఙ్‌లోని రూపములు, 10 వ వాక్యములోని "న్యవేదయత్" అను క్రియాపదము రూపములవలెనుండును.

వాక్యము 107

నకోపిజనః స్వీయాభిప్రాయాన్ ఇతరేష్వారోపయితుం అర్హతి.

(ఏ మనుష్యుడుకూడ తన అభిప్రాయములను ఇతరులయందు ఆరోపించు టకు తగడు)

దీనిలోని క్రియాపదము=అర్హతి. (తగియున్నాడు) వాక్యములో, 'న' అను అవ్యయముతో చేరుటవలన వ్యతిరేకార్థము కలిగినది.

"అర్హ=పూజాయామ్" అను ధాతువుయొక్క వర్తమానకాల (లట్) ప్రథమపురుష – ఏకవచనరూపము. భ్వాదిగణములోని పరస్మైపదిధాతువు.

వాక్యము కర్తరి ప్రయోగములో ఉన్నది.

అర్హతి అర్హతః అర్హంతి

మొదలుగా 8వ వాక్యములోని 'ఆరోహతి' అను క్రియాపదమునకువలె లట్ రూపములుండును.

"ఆరోపయితుమ్" అనునది తుమున్ ప్రత్యయాంతమగు అవ్యయము. ఆరోపించుటకు అని దాని యర్థము.

వాక్యము 108

లోకసేవార్థం కాంగ్రెస్‌దళమిదం జీవిష్యత్యేవ.

(ప్రజలసేవకొరకు ఈ కాంగ్రెస్‌పార్టీ జీవించియే ఉండగలదు)

ఈ వాక్యములోని క్రియాపదము=జీవిష్యతి. దానియర్థము "బ్రతికియుండగలదు" అని. 'ఏవ' అను అవధారణా (నిశ్చయా)ర్థకమగు అవ్యయముతో కలసి నిశ్చయార్థమును చెప్పుచున్నది,

జీవ=ప్రాణధారణే అనుధాతువుయొక్క భవిష్యత్కాల బోధకమగు లృట్ ప్రథమపురుష – ఏకవచనరూపము, ఇది పరస్మైపదిధాతువు. కర్తరి ప్రయోగము,

దీని లృట్ రూపములు 20వ వాక్యములోని క్రియాపదము రూపములవలెనుండును.

వాక్యము 109

రాష్ట్రపతిః శ్రీ సంజీవరెడ్డిః న్యూయార్క్‌నగరే సాఫల్యేన శస్త్రచికిత్సాం విరవర్త్స్యత.

(రాష్ట్రపతి శ్రీ సంజీవరెడ్డి న్యూయార్క్ నగరములో జయప్రదముగా శస్త్రచికిత్స Operation జరుపబడెను).

ఇందలి క్రియాపదము=నిరవర్త్యత. నిర్+అవర్త్యత=జరుపబడెను అని యర్థము. 'వృత్'=వర్తనే' అనుధాతువుయొక్క కర్మార్థకరూపము. భూతకాల బోధకమగు లఙ్ ప్రథమపురుష ఏకవచనము. 'నిర్' అనునది ఉపసర్గ.

ఆత్మనేపద ధాతురూపము. కర్మణిప్రయోగము. దీని లఙ్ రూపములు

నిరవర్త్యత నిరవర్త్యేతామ్ నిరవర్త్యంత మొ॥ క్రమములో 50 వ వాక్యములోని 'నిరైక్షత' అనిదాని రూపములవలె ఉండును.

వాక్యము 110

భారతీయ సంస్కృతేః పరిరక్షణార్థం సంస్కృతస్య ఉన్నతాస్థితిః ప్రదేయా.

(భారతీయ సంస్కృతిని కాపాడుటకొరకు సంస్కృతమునకు గొప్ప స్థానము ఇవ్వదగియున్నది.)

పై వాక్యములోని ప్రదేయా అనుశబ్దము. సుబంతశబ్దము. క్రియాపదము బదులుగా వాడబడిన కృదంతశబ్దము. ఇవ్వదగినది అని దానికర్థము. ఆకారాంత స్త్రీలింగశబ్దము ప్రథమావిభక్తి-ఏకవచనరూపము.

వాక్యము 111

న్యాయవ్యవహారేషు విలంబం వారయితుం ఉపాయాః శీఘ్రం పరిశీలనీయాః.

న్యాయవ్యవహారములందు ఆలస్యమును తొలగించుటకు ఉపాయములు శీఘ్రముగా పరిశీలింపదగియున్నవి).

ఈ వాక్యములోని పరిశీలనీయాః అనుపదము కృదంతమైన విశేషణ శబ్దము. ఇది సుబంతము. క్రియాపదము స్థానములో వాడబడిన శబ్దము. "పరిశీలింపదగినవి" అని ఆమాట కర్థము. ఇది అకారాంత పుంలింగశబ్దము యొక్క ప్రథమావిభక్తి బహువచనరూపము.

వాక్యము 112

శ్రీ సంజీవరెడ్డిః గతరాత్రౌ సుఖేన అస్వపత్.

(శ్రీ సంజీవరెడ్డి గతరాత్రి సుఖముగా నిద్రపోయెను)

ఇందలి క్రియాపదము = అస్వపత్ (నిద్రించెను) "ఞిష్వప్ = శయే" అను అదాది గణములోని ధాతువుయొక్క భూతకాలరూపము. లఙ్ ప్రథమ పురుష-ఏకవచనము.

దీని లఙ్ రూపములు 7వ వాక్యములోని 'అమిలత్' అను క్రియ యొక్క రూపములవలె తెలియవలెను.

పై వాక్యము కర్తరి ప్రయోగములోనున్నది. ధాతువు పరస్మైపది.

దీనికి లట్‌లో స్వపితి స్వపతః స్వపంతి ఇత్యాది విధముగా రూపములుండును. (49వ వాక్యములోని 'శ్వసితి' అను దాని రూపములవలెనే)

వాక్యము 113

శ్రీవాజపేయీ చతుఃపంచదినాభ్యంతరేరుగ్ణాలయాత్ ప్రస్థాస్యతే.

(శ్రీ వాజపేయి నాలుగైదు దినములలోపల వైద్యశాలనుండి బయలు దేరగలడు)

దీనిలోని క్రియాపదము=ప్రస్థాస్యతే - బయలుదేరగలడు అని దాని యర్థము. స్థా=గతినివృత్తౌ అను ధాతువుయొక్క భవిష్యదర్థకలృట్ ప్రథమ పురుష-ఏకవచనరూపము.

ఈ ధాతువు సహజముగా పరస్మైపది కాని సమ్, అవ, ప్ర, వి" అను ఉపసర్గలు చేరినప్పుడు ఆత్మనే పదముగా మారును. ప్రస్తుత రూపము ఆత్మనే పదము.

56వ వాక్యములో "ప్రయతిష్యతే" అను క్రియాపదము రూపములవలె దీనియొక్క లృట్ రూపములుండును. 'ప్ర' అనునది ఉపసర్గ.

వాక్యము 114

నేపాల ప్రధానమంత్రిణా శ్రీ తులసిగిరిణా స్వపదం పరిత్యక్తమ్.

(నేపాల్ ప్రధానమంత్రి శ్రీ తులసిగిరిచేత తన పదవి విడువబడినది.)

పై వాక్యమునందలి 'పరిత్యక్తమ్' అనునది క్త ప్రత్యయాంతమైన సుబంత శబ్దము. విడువబడినది అని ఆ మాట కర్థము. కర్మార్థములో ప్రయోగింపబడినదీవాక్యము.

అకారాంత నపుంసకలింగ శబ్దము, ప్రథమావిభక్తి-ఏకవచనరూపమిది.

వాక్యము 115

శ్రీ భార్గవా ఆంధ్రప్రదేశ ప్రశాసనం నిరదిశత్

(శ్రీ బార్గవా అంధ్రప్రదేశ్ ప్రభుత్వమును నిర్దేశించెను)

దీనిలోని క్రియాపదము=నిరదిశత్ దారిచూపెను

'దిశ'=అతిసర్జనే' అను ధాతువుయొక్క భూతకాల బోధకమగు లఙ్ ప్రథమపురుష-ఏకవచనరూపము. నిర్' అనునది ఉపసర్గ. ధాతువు పరస్మైపది. కర్తరి ప్రయోగవాక్యము,

దీని వర్తమాన (లట్) రూపములు :-

దిశతి దిశతః దిశంతి

అను విధముగా నుండును.

ఈ ధాతువుయొక్క సమాదిశత్ (సమ్+ఆ+ఆదిశత్) అను క్రియాపదము 93 వ. వాక్యమువద్ద వివరింపబడినది. లజ్‌లోని స్వరూపములు కూడ అక్కడ చూపబడినవి.

వాక్యము 116

అనయా సమిత్యా దేశస్య ఆర్థికస్థితిః గంభీరతయా విచార్యతే.

(ఈ సంఘముచేత దేశపు ఆర్థికస్థితి గంభీరముగా విచారింపబడు చున్నది.

ఈ వాక్యమందలి క్రియాపదము = విచార్యతే (విచారింపబడుచున్నది. 'చర = గతిభక్షణయోః' అను ధాతువుమీద ప్రేరణార్థమున కర్మణి ప్రత్యయము వచ్చిన రూపము. వర్తమానకాలము, లట్ ప్రథమ పురుష ఏకవచనము. ఆత్మనేపది ధాతువు కర్మణి ప్రయోగము.

26 వ వాక్యములోని 'శక్యతే' అను క్రియాపదమునకువలె దీనికి లట్‌లో మొత్తము రూపములను తెలియవలెను. 'వి' అనునది ఉపసర్గ.

వాక్యము 117

జనతాపక్షః స్వీయాధికారం కాంగ్రెస్ పక్షస్యోపరి ప్రతీకారబుద్ధ్యా ప్రయుంక్తే.

(జనతాపార్టీ తన అధికారాన్ని కాంగ్రెస్‌పార్టీ పైన ప్రతీకారబుద్ధితో ప్రయోగించుచున్నది.)

ఇందలి క్రియాపదము = ప్రయుంక్తే. ప్రయోగించుచున్నది

యుజిర్ = యోగే అను ధాతువుయొక్క వర్తమానకాలరూపము. లట్ ప్రథమపురుష - ఏకవచనము. ఇది ఉభయపది ధాతువు. ప్రస్తుతరూపము ఆత్మనేపదికి సంబంధించినది. 'ప్ర' అనునది ఉపసర్గ. ఈ ధాతువు రుధాది (7వ) గణములోనిది.

లట్ లో సమస్తరూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | యుంక్తే | యుంజాతే | యుంజతే |
| మ. పు. | యుంక్షే | యుంజాథే | యుంగ్ధ్వే |
| ఉ. పు. | యుంజే | యుంజ్వహే | యుంజ్మహే |

ఇవి ఆత్మనేపద రూపములు. ఇక పరస్మైపదరూపములు ఇట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | యునక్తి | యుంక్తః | యుంజంతి |
| మ. పు. | యునక్షి | యుంక్థః | యుంక్థ |
| ఉ. పు. | యునజ్మి | యుంజ్వః | యుంజ్మః |

ఈ ధాతువుయొక్క ల్ఋట్ రూపము "ప్రయోక్ష్యంతే" 104వ వాక్యము వద్ద వివరింపబడినది.

## వాక్యము 118

అస్మద్దేశః అధునా వివేకానంద సదృశాన్ పురుషాన్ అపేక్షతే.

(మనదేశము ఇప్పుడు వివేకానందునివంటి పురుషులను కోరుచున్నది.)

ఇంధలి క్రియాపదము = అపేక్షతే (కోరుచున్నది) లోకృ = దర్శనే అను ధాతువుయొక్క వర్తమానార్థక లట్ ప్రథమపురుష ఏకవచనరూపము. ఆత్మనేపది ధాతువు. కర్తరి ప్రయోగము. 'అప' అనునది ఉపసర్గ. చూచుట యను అర్థము కల 'ఈక్ష' ధాతువు 'అప' తో చేరినప్పుడు కోరుటయను అర్థమును బోధించును. అప + ఈక్షతే = అపేక్షతే గుణసంధి.

దీనికి లట్‌లో మొత్తము రూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అప+ఈక్షతే | ఈక్షేతే | ఈక్షంతే |
| మ. పు. | ఈక్షసే | ఈక్షేథే | ఈక్షధ్వే |
| ఉ పు. | ఈక్షే | ఈక్షావహే | ఈక్షామహే |

దీని లఙ్‌రూపము "నిరైక్షత" అనునది 50వ వాక్యమువద్ద వివరింపబడి రూపములు చూపబడినవి,

వాక్యము 119

జనతా పక్షస్య అనైకమత్యం మహానర్థాయ కల్పిష్యతే.

(జనతాపార్టీ ఐ-మత్యముగా లేకుండుట చాలహానికి సమర్థమగును.)

ఈ వాక్యమందలి క్రియాపదము=కల్పిష్యతే సమర్థమగును అని దాని యర్థము. 'కృపూ=సామర్థ్యే' అను ధాతువుయొక్క భవిష్యత్కాలబోధకమగు ల్పట్ ప్రథమపురుష ఏకవచనరూపము. ఆత్మనేపది ధాతువు, కర్తరి ప్రయోగ వాక్యము.

దీని ల్పట్ రూపములు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | కల్పిష్యతే | కల్పిష్యేతే | కల్పిష్యంతే |
| మ. పు. | కల్పిష్యసే | కల్పిష్యేధే | కల్పిష్యధ్వే |
| ఉ పు. | కల్పిష్యే | కల్పిష్యావహే | కల్పిష్యామహే |

దీనికి వర్తమాన (లట్) రూపములు

కల్పతే కల్పేతే కల్పంతే

ఇత్యాది క్రమములోనుండును.

వాక్యము 120

తే రాజ్యపాలాయ ఇదం నివేద యితుం ఇచ్ఛంతి.

(వారు గవర్నర్‌కు ఈ విషయమును విన్నవించుటకు కోరుచున్నారు)

ఇందలి క్రియా పదము=ఇచ్ఛంతి (కోరుచున్నారు)

"ఇష=ఇచ్ఛాయామ్" అను ధాతువు యొక్క వర్తమానకాల రూపము. లట్ ప్రథమ పురుష బహువచనము. పరస్మైపది ధాతువు. పైవాక్యము కర్తరి ప్రయోగములోనున్నది.

97వ వాక్యము వద్ద దీని ఏకవచనరూపము "ఇచ్ఛతి" అను పదము వివరింపబడినది. లట్ లోనిమొత్తము రూపములు కూడ అక్కడచూపబడినవి.

"నివేదయితుమ్" అనునది తుమున్ ప్రత్యయాంతమైన అవ్యయము. విన్నవించుటకు అని యర్థము.

వాక్యము 121

ప్రశాసనం లిఖిత సాక్ష్యాణి సందత్తే

(ప్రభుత్వము వ్రాతపూర్వకమైన సాక్ష్యములను కలిగియున్నది)

ఈ వాక్యములో క్రియాపదము=సంధత్తే.

సంధత్తే అనగా కలిగియున్నది అని యర్థము

డుధాఞ్=ధారణ పోషణయోః" అనుధాతువు యొక్క వర్తమాన లట్ ప్రథమపురుష ఏకవచన రూపము. ఇది ఉభయపదిధాతువు. ప్రస్తుతరూపము ఆత్మనేపదమునకు సంబంధించినది. 'సమ్' అనునది ఉపసర్గ.

ఈ క్రియకు లట్ స్వరూపములు:-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ధత్తే | దధాతే | దధతే |
| మ. పు. | ధత్సే | దధాథే | దద్ధ్వే |
| ఉ. పు. | దధే | దధ్వహే | దధ్మహే |

దీనికి పరస్మైపది రూపములు కూడ ఉండును.

వాక్యము 122

జనతాదళేన ప్రాశాసనికాంశేషు సముచితావధానం న ప్రదీయతే.

(జనతాపార్టీచేత పరిపాలన విషయములందు తగినంత శ్రద్ధ చూపబడుట లేదు )

ఇందలి క్రియాపదము = ప్రదీయతే (ఇవ్వబడుచున్నది) 'న' అను అవ్యయముతో గూడి వ్యతిరేకార్థమును బోధించును.

ఇది 'డు దాఞ్ = దానే' అను ధాతువుయొక్క కర్మార్థక రూపము. వర్తమానకాలము-లట్-ప్రథమ పురుష ఏకవచనము. 'ప్ర' అనునది ఉపసర్గ. కర్మణి ప్రయోగవాక్యము.

దీని లట్ రూపములు పూర్తిగా :-

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్ర + దీయతే | దీయేతే | దీయంతే |
| మ. పు. | దీయసే | దీయేథే | దీయధ్వే |
| ఉ. పు. | దీయే | దీయావహే | దీయామహే |

కర్మణిప్రయోగము కనుక ధాతువు ఆత్మనేపదిగానున్నది. కర్త్రర్థములో ఈ ధాతువు ఉభయపది. లట్ ఆత్మనేపదరూపములు పూర్వవాక్యమందలి ధత్తే అనుదానికివలె నుండును. పరస్మైపదములో

దదాతి దత్తః దదతి ఇత్యాది

క్రమములోనుండును.

వాక్యము 123

ఉభౌ అపి తౌ దళే ఐక్యమభివాంఛతః.

(వారు ఇద్దరుకూడ పార్టీయందు ఐకమత్యమును కోరుచున్నారు).

ఇందు క్రియాపదము=అభివాంఛతః. దానికి కోరుచున్నారు అని యర్థము

వాఛి=ఇచ్ఛాయామ్ అను ధాతువుయొక్క వర్తమానకాల బోధకమగు లట్ ప్రథమపురుష ద్వివచనరూపము ఇది పరస్మైపది ధాతువు, కర్తరి ప్రయోగము.

దీని లట్ రూపములు 97వ వాక్యములోని "ఇచ్ఛతి" అను క్రియాపదమునకు వలె ఉండును.

"అభి" అనునది ఉపసర్గము.

వాక్యము 124

స్వామి హరిదాసస్య సమాధౌ బహవః ప్రణతి పుష్పాంజలిం సమర్పయిష్యంతి.

(స్వామి హరిదాస్ సమాధియందు పెక్కుమంది నమస్కారపూర్వకముగా పుష్పాంజలిని సమర్పింతురు.)

ఇందలి క్రియాపదము=సమర్పయిష్యంతి, సమ్+అర్పయిష్యంతి. సమర్పింతురు, ఇత్తురు) "ఋ=గతౌ" అను ధాతువుయొక్క ప్రేరణార్థపు భవిష్యత్కాల లృట్ ప్రథమ పురుష బహువచన రూపము, 'సమ్' అనునది ఉపసర్గ.

దీనిలృట్ రూపములు 22 వ వాక్యములోని "ప్రసారయిష్యతి" అను దాని రూపముల విధమున నుండును.

లట్‌లో – అర్పయతి అర్పయతః అర్పయంతి

ఇత్యాదిగా రూపములుండును.

వాక్యము 125

భారతం ఇతరదేశానాం భూమిం అధికర్తుంన కామయతే.

(భారతదేశము ఇతరదేశముల భూమినాక్రమించుటకు కోరుటలేదు.)

ఈ వాక్యమునందలి క్రియాపదము—కామయతే. కామయతే అనగా కోరుచున్నది అని యర్థము. "న" అను వ్యతిరేకార్థకమగు అవ్యయముతో చేరుటవలన కోరుటలేదని యర్థము కలిగినది.

'కము—కాంతౌ' అను ధాతువుయొక్క వర్తమానకాల బోధకమగు లట్ ప్రథమ పురుష ఏకవచనరూపము. ఇది ఆత్మనేపది ధాతువు.

దీనికి లట్‌లోని రూపములు 122వ వాక్యములోని "ప్రదీయతే" అను క్రియాపదము రూపములవలె గ్రహింపదగును.

పై వాక్యములోని 'అధికర్తుమ్' అను పదము తుమున్ ప్రత్యయాంతమైన అవ్యయము. ఆక్రమించుట కొరకు అని దాని యర్థము.

వాక్యము 126

శ్రీ ఎస్. ఆర్. దాసః బహూనివర్షాణి విశ్వభారత్యాః కులపతి పదమధ్యాస్త.

(శ్రీ ఎస్ ఆర్. దాస్ పెక్కు సంవత్సరములు విశ్వభారతికి కులపతి పదవిని వహించిరి.)

ఇందలి క్రియాపదము—అధ్యాస్త (అధిష్ఠించెను) 'ఆస—ఉపవేశనే' అను ధాతువు, భూతకాల బోధకమగు లజ్ ప్రథమపురుష-ఏకవచనరూపము ఇది అదాది గణములోని ఆత్మనేపది ధాతువు. 'అధి' అనునది ఉపసర్గ

దీని లజ్ రూపములు క్రింది విధముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అధి+ఆస్త | ఆసాతామ్ | ఆసత |
| మ. పు. | ఆస్థాః | ఆసాథామ్ | ఆధ్వమ్ |
| ఉ. పు | ఆసి | ఆస్వహి | ఆస్మహి |

వర్తమాన లట్ రూపములు ఆస్తే ఆసాతే ఆసతే మొద॥ క్రమములో ఉండును.

వాక్యము 127

స్వాస్థ్యమంత్రీ శ్రీ రాజనారాయణః హ్యః కలకత్తాయాం అబ్రవీత్.
(ఆరోగ్యశాఖామంత్రి శ్రీ రాజనారాయణ విన్న కలకత్తాలో పలికెను.)

ఈ వాక్యములోని క్రియాపదము — అబ్రవీత్. పలికెను, మాట్లాడెను అని దాని యర్థము. '(బ్రూఞ్ = వ్యక్తాయాంవాచి' అను ధాతువుయొక్క భూత కాలార్థములో లఙ్ ప్రథమపురుష ఏకవచనము. ఇది ఉభయపదిధాతువు. ప్రస్తుతరూపము పరస్మైపదమునకు చెందినది.

లఙ్‌లో దీని మొత్తము రూపములు:—

| | | |
|---|---|---|
| అబ్రవీత్ | అబ్రూతామ్ | అబ్రువన్ |
| అబ్రవీః | అబ్రూతమ్ | అబ్రూత |
| అబ్రవమ్ | అబ్రూవ | అబ్రూమ |

పైవాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

వాక్యము 128

ఉపరాష్ట్రపతినా ఏకః అధ్యాదేశః ప్రసారితః
(ఉపరాష్ట్రపతిచేత ఒక ఆర్డినెన్సు జారీ చేయబడినది)

ఇందలి 'ప్రసారితః' అను సుబంత శబ్దము వాక్యములో క్రియాపదము నకు మారుగా వాడబడినది. విడుదల చేయబడినది అని దాని యర్థము.

క్త ప్రత్యయాంతమైన శబ్దము. కర్మార్థమున ప్రయుక్తము. అకారాంత పుంలింగ శబ్దము; ప్రథమావిభక్తి ఏకవచనరూపము.

వాక్యము 129

శ్రీ ఆనందకుమార స్వామీ పశ్చిమార్ధే భారతీయ సంస్కృతేః, కళానాంచ ప్రచారకః అవర్తిష్ట.

(శ్రీఆనందకుమారస్వామి పశ్చిమార్ధ గోళములో భారతీయ సంస్కృతికి, కళలకు ప్రచారకర్తగా ఉండెను)

దీనిలో క్రియాపదము = అవర్తిష్ట (ఉండెను)
వృతు = వర్తనె, అను ధాతువు యొక్క భూతకాల బోధకమగు లుఙ్ ప్రథమ పురుష ఏకవచనరూపము. ఇది ఆత్మనే పదిధాతువు.

కర్తరి ప్రయోగవాక్యము.
ఈక్రియకు లుఙ్ లో రూపములు ఇట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అవర్తిష్ట | అవర్తిష్టాతామ్ | అవర్తిషత |
| మ. పు. | అవర్తిష్ఠాః | అవర్తిష్టాథామ్ | అవర్తిధ్వమ్ |
| ఉ. పు. | అవర్తిషి | అవర్తిష్వహి | అవర్తిష్మహి |

ఈ ధాతువుయొక్క లట్ రూపము 'ప్ర' అను ఉపసర్గ యుక్తము "ప్రవర్తంతే" అనునది 35 వ వాక్యమువద్ద వివరింపబడి, మూడుపురుషల రూపములు కూడ అక్కడ చూపబడినవి.

వాక్యము 130

సిమ్లానగరే సంస్కృత దివసమాఽక్ష్య సమావేశాః, నిర్వర్తితాః

(సిమ్లా నగరములో సంస్కృత దివసము సందర్భముగా సమావేశములు జరుపబడినవి)

పై వాక్యములోని నిర్వర్తితాః అనుపదము క్త ప్రత్యయముతో గూడిన సుబంతశబ్దము. క్రియాపదము స్థానములో వాక్యమందు ప్రయోగింపబడినది. 'జరుపబడినవి' అని ఆ పదమునకర్థము.

ఇది అకారాంత పుంలింగశబ్దము. ప్రథమావిభక్తి బహువచనరూపము. కర్మణి ప్రయోగ వాక్యము.

వాక్యము 131

తైల మూల్యేషు వ్యవకలనం సమారబ్ధం అభూత్.

(నూనెల ధరలయందు తగ్గుదల ప్రారంభము అయినది)

ఇందలి క్రియాపదము—అభూత్ (అయినది) 'భూ—సత్తాయామ్' అను ధాతువు యొక్క భూతకాల బోధకమైన లుఙ్ ప్రథమపురుష ఏకవచనము ఇది మొదటిగణము మొదటి ధాతువు. పరస్మైపది. పై వాక్యము కర్తరి ప్రయోగములో నున్నది.

లుఙ్‌లో దీని మొత్తము రూపములు:—

| | | |
|---|---|---|
| అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| అభూః | అభూతమ్ | అభూత |
| అభూవమ్ | అభూవ | అభూమ |

దీని లట్ రూపములు—భవతి భవతః భవంతి ఇత్యాదిక్రమములో ఉండును.

ఇతరోదాహరణములు—

1 స్వాతంత్ర్యదినావసరే మహాన్ ఉత్సవః అభూత్

(స్వాతంత్ర్య దినసందర్భముగా గొప్పఉత్సవముజరిగెను)

2 త్వం విద్యయా పండితః అభూః మ.పు. ఏక

(నీవు విద్యచేత పండితుడవు అయితివి)

3 అహం పరీక్షాయాం ఉత్తీర్ణః అభూవమ్

(నేను పరీక్షయందుత్తీర్ణుడ నయితిని) ఉ.పు. ఏక

వాక్యము 132

శ్రీదండావతే వార్తాహరాణాం ప్రశ్నాన్ ఉత్తరయతిస్మ.

(శ్రీదండావతే పత్రికావిలేఖరుల ప్రశ్నలకు సమాధానముల నిచ్చుచుండెను)

ఈ వాక్యములోని క్రియాపదము = ఉత్తరయతి సమాధానములనిచ్చుచున్నాడని యర్థము.

ఉత్తరంఆచష్టే = ఉత్తరయతి. ఇది నామ ధాతువు. అనగా నామ వాచకము క్రియగా మారినది, సుబంతములు కొన్ని యర్థములలో క్యచ్ మొదలగు ప్రత్యయములు వచ్చి నామధాతువులుగా ఏర్పడును. ఇదికూడ అటువంటిదే. పై క్రియారూపము వర్తమానార్థకమగు లట్ ప్రథమపురుష ఏకవచనము.

దీని లట్ రూపములు; 69 వ వాక్యములోని 'ఘాటయతి' అను క్రియాపదపు రూపములవలె ఉండును. ఉత్తరయతి ఉత్తరయతః ఉత్తరయంతి మొ॥

వాక్యము 133

జనతా పక్షః కథమపి జనాన్ నవంచయిష్యతి (జనతాపార్టీ ఏవిధముగా కూడ జనులను మోసగించదు)

ఇందలి క్రియాపదము = వంచయిష్యతి. మోసము చేయగలదు అని దాని యర్థము. 'న' తో కూడినందున వ్యతిరేకార్థము కలిగినది.

ఇది చురాది (10వ) గణములోని 'వఞ్చు=ప్రలంభనే' అను ధాతువు యొక్క ల్ఋట్ ప్రథమ పురుష ఏకవచనరూపము భవిష్యత్కాల బోధకము. పరస్మైపద ధాతువు.

వంచయిష్యతి వంచయిష్యతః వంచయిష్యంతి

మొ॥ ల్ఋట్ రూపములు 22వ వాక్యములోని 'ప్రసారయిష్యతి' అను క్రియ రూపములవలె గుర్తింపవలెను. 'కథమపి' అనునది అవ్యయము. ఏ విధముగా నైనను అని ఆపదమునకర్థము.

వాక్యము 134

ప్రశాసనం హరిజన సమస్యావిషయే సమాధానాత్మకం యత్నం కర్తుం ఈహతే.

(ప్రభుత్వము హరిజనుల సమస్యల విషయమందు సమాధాన రూపమైన ప్రయత్నమును చేయుటకు కోరుచున్నది.)

ఈ వాక్యములోని క్రియాపదము=ఈహతే. ఈహతే అనగా కోరుచున్నది అని యర్థము.

"ఈహ= చేష్టాయామ్" అను ధాతువు యొక్క వర్తమానార్థక లట్ ప్రథమ పురుష ఏకవచన రూపము.

ఈ ధాతువు ఆత్మనేపద వాక్యము కర్తరి ప్రయోగములో ఉన్నది.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ఈహతే | ఈహేతే | ఈహంతే |
| మ. పు. | ఈహసే | ఈహేథే | ఈహధ్వే |
| ఉ. పు | ఈహే | ఈహావహే | ఈహామహే |

ఇవి లట్ సంపూర్ణరూపములు

వాక్యము 135

శ్రీమతి ఇందిరా గాంధీ హ్యః శ్రీనగరం సమవాప.

(శ్రీమతి ఇందిరా గాంధీ నిన్న శ్రీనగర్ చేరుకున్నది)

దీనిలోని క్రియాపదము = సమవాప

సమ్ + అవ + ఆప = సమవాప (చేరెను. పొందెను) సమ్, అవ" అనునవి ఉపసర్గలు.

అప్ల్ = వ్యాప్తౌ" అను ధాతువు యొక్క లిట్ ప్రథమ పురుష ఏకవచన రూపము. పరోక్షభూతార్థములో లిటు రూపములు ప్రయోగింపబడును. సంస్కృత వార్తా ప్రసారాలలో లిట్ ప్రయోగములు చాల అరుదుగా జరుగుచుండును. ఇప్పటి వరకు వ్రాసిన వాక్యములలో ఇదియే మొదటి "లిట్" రూపము కల వాక్యము.

ఇది 5వ గణములోని పరస్మైపది ధాతువు. దీని వర్తమానార్థములో రూపము లిట్లుండును:—

| | | | |
|---|---|---|---|
| ప్ర పు. | ఆప్నోతి | ఆప్నుతః | ఆప్నువంతి |
| మ. పు | ఆప్నోషి | ఆప్నుథః | ఆప్నుథ |
| ఉ. పు. | ఆప్నోమి | ఆప్నువః | ఆప్నుమః |

పైవాక్యములో ప్రయోగింపబడిన క్రియా పదమునకు లిట్‌లో మూడు పురుషల రూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | సమవ + ఆప | ఆపతుః | ఆపుః |
| మ. పు. | ఆపిథ | ఆపథుః | ఆప |
| ఉ. పు. | ఆప | ఆపివ | ఆపిమ |

వాక్యము 136

శ్రీ మొరార్జీ దేశాయ్ మాస్కో నగరే దిన చతుష్టయం స్థాస్యతి.

(శ్రీ మొరార్జీ దేశాయ్ మాస్కో నగరములో నాలుగు రోజులు ఉండగలడు (రు)

ఇందలి క్రియా పదము = స్థాస్యతి (ఉండగలడు).

"ష్ఠా = గతి నివృత్తౌ" అను ధాతువు యొక్క లృట్ ప్రథమ పురుష ఏకవచన రూపము. భవిష్యత్కాల బోధకము కర్తరి ప్రయోగ వాక్యమిది.

లృట్ రూపములు పూర్తిగా:—

| | | | |
|---|---|---|---|
| ప్ర పు. | స్థాస్యతి | స్థాస్యతః | స్థాస్యంతి |
| | స్థాస్యసి | స్థాస్యథః | స్థాస్యథ |
| | స్థాస్యామి | స్థాస్యావః | స్థాస్యామః |

వాక్యము 137

గుజరాత్ రాజ్యే చతుర్భ్యః సంస్కృత విద్వద్భ్యః పురస్కారాః ఉపాహితాః

(గుజరాత్ రాష్ట్రములో నలుగురు సంస్కృత పండితులకు బహుమతులు ఈయబడినవి)

ఈ వాక్యములోని 'ఉపాహితాః' అను పదము క్త ప్రత్యయాంతమగు దంతశబ్దము. క్రియాపదము స్థానములో ప్రయోగింప బడినది. కర్మణి ప్రయోగము. ఇది అకారాంత పుంలింగశబ్దము, ప్రథమావిభక్తి బహువచన రూపము. కర్మణి ప్రయోగములోనున్న వాక్యమిది.

వాక్యము 139

హరిజనేషు అత్యాచారాః రాష్ట్రియ జనసమిత్యాభృశం వ్యనిన్ద్యంత.

(హరిజనుల విషయములో జరుగుచున్న అత్యాచారములు జాతీయలోక దళముచేత మిక్కిల నిందింపబడినవి)

ఇందలి క్రియాపదము = వ్యనిన్ద్యంత. వి + అనిన్ద్యంత = వ్యనిన్ద్యంత (నిందింపబడినవి) "ణిది = కుత్సాయామ్" అను ధాతువుయొక్క

కర్మార్థకభూతకాల లఙ్ ప్రథమపురుష బహువచనరూపము. 'వి' అనునది ఉపసర్గ. కర్మార్థము కనుక ధాతువు ఆత్మనేపదరూపమును పొందినది.

దీని లఙ్ రూపములు మొత్తము ఇట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | వి+అనిన్ద్యత | అనిన్ద్యేతామ్ | అనిన్ద్యన్త |
| మ. పు. | అనిన్ద్యథాః | అనిన్ద్యేథామ్ | అనిన్ద్యధ్వమ్ |
| ఉ. పు. | అనిన్ద్యే | అనిన్ద్యావహి | అనిన్ద్యామహి |

వాక్యము 139

విదేశమన్త్రీ, నేపాల్ సర్వకారేణ స్వీయసంభాషణం సంతృప్తికరం అవర్ణయత్.

(విదేశ వ్యవహారాల మంత్రి, నేపాల్ ప్రభుత్వంలో తన సంభాషణ తృప్తికరముగా నున్నదని వర్ణించెను.)

ఈ వాక్యములోని క్రియ=అవర్ణయత్ (వర్ణించెను) చురాది(10వ) గణములోని 'వర్ణ=వర్ణనే' అను ధాతువుయొక్క భూతకాల బోధకమైన లఙ్ ప్రథమపురుష ఏకవచన రూపము. పరస్మైపదిధాతువు. కర్తరి ప్రయోగము.

దీని లఙ్ స్వరూపములు :—

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అవర్ణయత్ | అవర్ణయతామ్ | అవర్ణయన్ |
| మ. పు. | అవర్ణయః | అవర్ణయతమ్ | అవర్ణయత |
| ఉ. పు. | అవర్ణయమ్ | అవర్ణయావ | అవర్ణయామ |

వర్తమానార్థములో

వర్ణయతి వర్ణయతః వర్ణయన్తి

ఇత్యాదిగా నుండును.

వాక్యము 140

శ్రీనానాజీ దేశముఖః, ప్రాక్తన సర్వకారః మూలవృద్ధి కారణః ఇతిఅభాణీత్.

(శ్రీనానాజీదేశ్‌ముఖ్, పూర్వప్రభుత్వము ధరల పెరుగుదలకు కారణమని పలికెను.)

ఇందలి క్రియాపదము—అభాణీత్ (పలికెను) మొదటిదగు భ్వాది గణములోని భణ—శబ్దే" అను ధాతువుయొక్క భూతకాల లుఙ్ ప్రథమ పురుష ఏకవచన రూపము. ఇది పరస్మైపది ధాతువు. కర్తరి ప్రయోగము.

దీని లుఙ్ పూర్తి రూపములు క్రిందివిధముగాఉ ండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అభాణీత్ | అభాణిష్టామ్ | అభాణిషుః |
| మ. పు. | అభాణీః | అభాణిష్టమ్ | అభాణిష్ట |
| ఉ. పు. | అభాణిషమ్ | అభాణిష్వ | అభాణిష్మ |

దీనికి వర్తమాన రూపములు.

| | | |
|---|---|---|
| భణతి | భణతః | భణంతి |

మొ॥విధముగా ఉండును.

వాక్యము 141

ప్రధాన మంత్రీ అద్యసాయం త్రివేంద్రం ప్రాప్స్యతి.

(ప్రధానమంత్రి ఈ రోజు సాయంకాలము త్రివేంద్రము చేరగలరు(డు))

ఇందలి క్రియాపదము—ప్రాప్స్యతి. (చేరగలడు)

"ఆప్ల—వ్యాప్తౌ" అనుధాతువుయొక్క భవిష్యత్కాల బోధకమైన ల్ఋట్ ప్రథమపురుష ఏకవచన రూపము. "ప్ర" అనునది ఉపసర్గ.

దీని లృట్ పూర్తి రూపములు:-

| | | | |
|---|---|---|---|
| ప్ర పు | ప్ర+ఆప్స్యతి | ఆప్స్యతః | ఆప్స్యంతి |
| మ. పు. | ఆప్స్యసి | ఆప్స్యథః | ఆప్స్యథ |
| ఉ. పు | ఆప్స్యామి | ఆప్స్యావః | ఆప్స్యామః |

ఇది 5వ గణములోని పరస్మైపది ధాతువు. దీని వర్తమాన రూపములు ఆప్నోతి ఆప్నుతః ఆప్నువంతి ఇత్యాది రీతిలోనుండును

వాక్యము 142

ఆస్ట్రేలియాదేశే భారత దూతావాసస్య కర్మకరాః వ్యాపాదయిష్యంతే ఇతి భర్త్సితమ్.

(ఆస్ట్రేలియాలో భారత రాయబారి కార్యాలయంలోని ఉద్యోగులు చంపబడెదరని బెదరింపు చేయబడినది)

ఇందలి క్రియాపదము=వ్యాపాదయిష్యంతే.

"చంపబడగలరు" అని దానియర్థము.

"పద=గతౌ" అనుధాతువు ప్రేరణార్థకముమీద కర్మార్థ రూపము, భవిష్యత్కాల బోధకమైన లృట్ ప్రథమపురుష బహువచనము.

ఆత్మనే పదిధాతురూపము. "వి", "ఆ" ఉపసర్గలు

దీని లృట్ సంపూర్ణరూపము 9వ వాక్యములోని "ఆయోజయిష్యతే" అను క్రియాపదమునకువలె ఉండును.

వ్యాపాదయతి మొ॥నవి దీనికి వర్తమాన రూపములు. ఉపసర్గలు చేరుట వలన గత్యర్థకమగు ధాతువు చంపుట అను అర్థమును బోధించుచున్నది భర్త్సితమ్=బెదిరింప బడినది. ఇది కృదంత శబ్దము.

వాక్యము 143

రాష్ట్రపతిః న్యూయార్క్ నగరాత్ అద్యస్వదేశం ప్రతిష్ఠతే.

(రాష్ట్రపతి న్యూయార్క్ నగరమునుంచి నేడు స్వదేశమును గూర్చి బయలుదేరుచున్నారు. (డు) )

ఈవాక్యములోని క్రియాపదము=ప్రతిష్ఠతే, బయలుదేరుచున్నాడని దాని కర్థము.

"ష్ఠా=గతినివృత్తౌ" అను ధాతువుయొక్క వర్తమాన కాల లట్ ప్రథమపురుష ఏకవచన రూపము. ఇది సహజముగా పరస్మైపద ధాతువు. కాని 'ప్ర' అను ఉపసర్గతో గూడినప్పుడు ఆత్మనేపదరూపములను పొందును. కర్తరిప్రయోగము.

దీని లట్ రూపములు సంపూర్ణముగా నిట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ప్ర+తిష్ఠతే | తిష్ఠేతే | తిష్ఠంతే |
| మ. పు. | తిష్ఠసే | తిష్ఠేథే | తిష్ఠధ్వే |
| ఉ. పు. | తిష్ఠే | తిష్ఠావహే | తిష్ఠామహే |

దీని భవిష్యత్కాల రూపము 'ప్రస్థాస్యతే' అనునది 113వ వాక్యము వద్ద వివరింపబడినది.

'ప్ర' చేరనప్పుడు పరస్మైపది రూపములుండును.
తిష్ఠతి తిష్ఠతః తిష్ఠంతి మొదలగునవి.
'అద్య' అనునది అవ్యయము. నేడు అని దాని యర్థము.

వాక్యము 144

చిన్మయ జ్ఞానమిషన్ సంస్థయా గీతాజ్ఞానయజ్ఞః హ్యః సమారబ్ధః

(చిన్మయజ్ఞానమిషన్‌చేత నిన్నగీతాజ్ఞానయజ్ఞము ప్రారంభింపబడినది)

దీనిలోని సమారబ్ధః అనునది సుబంతశబ్దము. క్త ప్రత్యయాంతమైనది క్రియాపదము స్థానమున వాడబడినది. కర్మార్థకమైన ప్రత్యయము చేరిన

రూపము "సమారబ్ధః" అకారాంత పుంలింగ శబ్దము, ప్రథమావిభక్తి ఏక వచనరూపము.

వాక్యము 145

జనతాకార్యకర్తారః హరిజనానాం సందేహం అపాకుర్యుః

(జనతాపార్టీ కార్యకర్తలు హరిజనులయొక్క అనుమానములను తొలగింపవలెను)

ఇందలి క్రియాపదము = అపాకుర్యుః (తొలగింపవలెను)

'డుకృఞ్ = కరణే' అను ధాతువుయొక్క విధ్యర్థకమగు లిఙ్ ప్రథమ పురుష బహువచన రూపమిది 'అప' 'ఆ' అను రెండుఉపసర్గలు. ఉభయపది ధాతువుయొక్క పరస్మైపది రూపము దీనివిధి లిఙ్ సర్వపురుష రూపములు:

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అపా + కుర్యాత్ | కుర్యాతామ్ | కుర్యుః |
| మ. పు. | కుర్యాః | కుర్యాతమ్ | కుర్యాత |
| ఉ. పు. | కుర్యామ్ | కుర్యావ | కుర్యామ |

ఈధాతువు యొక్క వర్తమానకాలపు రూపము 'కుర్వంతి' అనునది 53 వ వాక్యములో వివరింపబడినది. మొత్తము రూపములుకూడ అచ్చట చూపబడినవి.

వాక్యము 146

యువకాః అస్మిన్ కార్యేమహత్త్వ పూర్ణాంభూమి కాంనిర్వహేయుః

(యువకులు ఈ కార్యమునందు చాలముఖ్యమైన పాత్రను నిర్వహింపవలెను)

ఈ వాక్యములోని క్రియాపదము = నిర్వహేయుః నిర్వహింపవలెను అని దాని యర్థము.

వహ—ప్రాపణే అనుధాతువుయొక్క విధ్యర్థకమగులిఙ్ ప్రథమపురుష బహువచన రూపము. 'నిర్' అనునది ఉపసర్గ. వహ ధాతువు పరస్మైపది.

దీనికి విధిలిఙ్‌లో పూర్తిరూపములిట్లుండును

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | నిర్ + వహేత్ | వహేతామ్ | వహేయుః |
| మ.పు. | వహేః | వహేతమ్ | వహేత |
| ఉ. పు. | వహేయమ్ | వహేవ | వహేమ |

దీనికి వర్తమానార్థములో వహతి వహతః వహంతి మొదలగుక్రమముగా రూపములుండును.

వాక్యము 147

శ్రీ మొరార్జీదేశాయ్ ఇందిరాగాంధీ మహాభాగాయాః ఆక్షేపంనిరాకరోత్.

(శ్రీమొరార్జీదేశాయ్ ఇందిరాగాంధీయొక్క ఆరోపణను తిరస్కరించెను)

ఈ వాక్యములోని క్రియాపదము—నిరాకరోత్. దానికి నిరాకరించెను అనిఅర్థము.

"డు కృఞ్—కరణే" అను ధాతువుయొక్క భూతకాలార్థకమగు లఙ్ ప్రథమపురుష ఏకవచన రూపము, "నిర్,ఆ" అను రెండు ఉపసర్గలు.

ఈ ధాతువు ఉభయపది. ప్రస్తుత రూపము పరస్మైపదికి సంబంధించినది.

దీనికి లఙ్‌లోని మొత్తము రూపములు:—

| | | |
|---|---|---|
| అకరోత్ | అకురుతామ్ | అకుర్వన్ |
| అకరోః | అకురుతమ్ | అకురుత |
| అకరవమ్ | అకుర్వ | అకుర్మ |

వాక్యము 148

శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయస్య జన్మదిన సమారోహ వృత్తాంతాఃనైక స్థలేభ్యః అవాప్యంతే.

(శ్రీ దీనదయాల్ ఉపాధ్యాయ జన్మదినోత్సవ వార్తలు అనేకస్థలముల నుండి అందుచున్నవి)

ఇందలి క్రియాపదము = అవాప్యంతే "పొందబడుచున్నవి" అని దాని యర్థము.

"ఆప్ల = వ్యాప్తౌ" అను ధాతువుయొక్క కర్మార్థక వర్తమానకాలరూపము. లట్ ప్రథమపురుష బహువచనము. కర్మార్థము కనుక ఆత్మనేపదిధాతువుగా మారినది, అవ అనునది ఉపసర్గ.

దీని లట్ రూపములు పూర్తిగా :-

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అవ + ఆప్యతే | ఆప్యేతే | ఆప్యంతే |
| మ.పు. | ఆప్యసే | ఆప్యేథే | ఆప్యధ్వే |
| ఉ.పు | ఆప్యే | ఆప్యావహే | ఆప్యామహే |

సహజముగా ఈ ధాతువు పరస్మైపది. కర్త్రర్థములో దీని లట్ రూపములు—

| | | |
|---|---|---|
| ఆప్నోతి | ఆప్నుతః | ఆప్నువంతి |
| ఆప్నోషి | ఆప్నుథః | ఆప్నుథ |
| ఆప్నోమి | ఆప్నువః | ఆప్నుమః |

ఈ ధాతువుయొక్క భవిష్యత్కాలరూపము ప్ర+ఆప్స్యతి అనునది 141 వ వాక్యమువద్ద వివరింపబడినది.

వాక్యము 149

జనతాదర్శే మతవైవిధ్యం పరిలక్ష్యతే ఏవ.

(జనతా పార్టీలో అభిప్రాయభేదము కన్పించుచునే ఉన్నది.)

ఈ వాక్యములోని క్రియాపదము = "పరిలక్ష్యతే"

"చూడబడుచున్నది, కాన్పించు చున్నది" అని దానియర్థము.

"లక్ష = దర్శనాంకనయోః" అను ధాతువు యొక్క కర్మార్థ మందలి వర్తమాన కాలరూపము.

లట్ ప్రథమ పురుష-ఏకవచనము. ఆత్మనే పదిధాతువు. 'పరి' అనునది ఉపసర్గ

చురాది (10వ)గణములోని ధాతువిది.

దీని లట్‌లోని సంపూర్ణ రూపములు:-

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | పరి + లక్ష్యతే | లక్ష్యేతే | లక్ష్యంతే |
| మ.పు. | లక్ష్యసే | లక్ష్యేథే | లక్ష్యధ్వే |
| ఉ.పు. | లక్ష్యే | లక్ష్యావహే | లక్ష్యామహే |

కర్త్రర్థములో దీనికి లక్షయతి, లక్షయతః లక్షయంతి ఇత్యాదిరీతిలో వర్తమానరూపములుండును.

పై వాక్యములోని 'ఏవ' అను అవ్యయము నిశ్చయార్థకము.

వాక్యము 150

జనాః స్వామినః శ్రద్ధానందస్య ఉపదేశం అనుసరేయుః.

(ప్రజలు స్వామి శ్రద్ధానందుల ఉపదేశమును అనుసరింప వలెను).

పై వాక్యము నందలి క్రియాపదము = "అనుసరేయుః"

"అనుసరింపవలెను" అని దానియర్థము.

"సృ = గతౌ" అనుధాతువుయొక్క విధ్యర్థకమైన లిఙ్ ప్రథమపురుష బహువచనరూపము.

"అను" అనునది ఉపసర్గ. భ్వాది (1వ) గణములోని పరస్మైపది ధాతువు. ఈ ధాతువుయొక్క వర్తమాన, భవిష్యత్కాలరూపములు 'అనుసరతి 'అనుసరిష్యతి' అనునవి 58, 59 వాక్యములందు వివరింపబడినవి. దీనికి విధిలిజ్‌లో పూర్తిరూపములిట్లుండును—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అను+సరేత్ | సరేతామ్ | సరేయుః |
| మ పు. | సరేః | సరేతమ్ | సరేత |
| ఉ. పు. | సరేయమ్ | సరేవ | సరేమ |

పైవాక్యము కర్తరి ప్రయోగములోనున్నది. ఆజ్ఞాపించుట. ప్రార్థించుట పిలుచుట, మొదలగు అర్థములందు విధిలిజ్ ప్రయోగింపబడును. దీనిని ఆంగ్లములో Imperative mood అని చెప్పుదురు.

ఇంతవరకు ఆకాశవాణి సంస్కృత వార్తలలో ప్రసారమైన వాక్యముల ద్వారా అందలి క్రియాపదములనుగూర్చి వివరింపబడినది. ఈ 150వాక్యములలో ముఖ్యములగు క్రియాపదములు చాలవరకు వచ్చినవి. కావున ఇంతటతో వాక్యములను ముగించుచున్నాను. ఇంకను మిగిలిన కొన్ని ముఖ్యములగు క్రియాపదములను, వార్తలలో, నిత్యవ్యవహారములో తరచుగా వాడబడు వానిని పేర్కొని కేవలము వాని యర్థములు మాత్రము చూప బడును. క్రియాపదములతరువాత, పాఠకుల సౌకర్యముకొరకు, వార్తాప్రసారాలలో ప్రయోగింపబడిన కొన్నిముఖ్యములైన నామవాచకములు, విశేషణములు, అవ్యయములు కూడా అర్థప్రదర్శన పూర్వకముగా నిరూపింపబడును.

మొదట క్రియాపదములను అకారాది క్రమముతో నిరూపింతును.

1 వర్తమాన కాలము — ఏకవచనము.

1 అటతి = తిరుగుచున్నాడు/ది

2 అత్తి = తినుచున్నాడు/ది

3 అభివ్యనక్తి = వ్యక్తముచేయుచున్నాడు/ది
4 అర్చయతి = పూజించుచున్నాడు/ది
5 అవలోకయతి = చూచుచున్నాడు/ది
6 అనుమీయతే = ఊహింపబడుచున్నది/డు
7 ఆస్తే = కూర్చున్నాడు/ది
8 ఆప్నోతి = పొందుచున్నాడు/ది
9 అర్జతియ = సంపాదించుచున్నాడు/ది
10 ఆలోచయతి = ఆలోచించుచున్నాడు/ది
11 ఆశాస్తే = అశించుచున్నాడు/ది
12 ఆకర్షతి = ఆకర్షించుచున్నాడు/ది
13 ఈక్షతే = చూచుచున్నాడు/ది
14 ఉహ్యతే = వహింవబడుచున్నది/డు
15 ఉదాహరతి = ఉదాహరించుచున్నాడు/ది
16 ఏతి = పొందుచున్నాడు/ది
17 ఏధతే = వృద్ధినొందుచున్నాడు/ది
18 కరోతి = చేయుచున్నాడు/ది (పరస్మై)
19 కురుతే = ,, ,, (ఆత్మనే)
20 కథయతి = చెప్పుచున్నాడు/ది.
21 క్రీణాతి = కొనుచున్నాడు/ది
22 (వి)క్రీణాతి = అమ్ముచున్నాడు/ది
23 కుప్యతి = కోపించుచున్నాడు/ది
24 క్రుధ్యతి = ,, ,,
25 కాంక్షతే = కోరుచున్నాడు/ది
26 గచ్ఛతి = వెళ్లుచున్నాడు ది
27 (ఆ) గచ్ఛతి = వచ్చుచున్నాడు/ది
28 గణయతి = లెక్కించుచున్నాడు/ది
29 గృహ్ణాతి = గ్రహించుచున్నాడు/ది

30 ఘటయతి = కూర్చుచున్నాడు/ది

31 చరతి = తిరుగుచున్నాడు/ది

32 చింతయతి = విచారించుచున్నాడు/ది

33 జాయతే = పుట్టు/కలుగుచున్నాడు/ది

34 జానాతి = తెలియుచున్నాడు/ది

35 జ్ఞాయతే = తెలియబడుచున్నాడ/ది

36 జయతి = గెలుచుచున్నాడు/ది

37 జనయతి = కలిగించుచున్నాడు/ది

38 జహాతి = విడుచుచున్నాడు/ది

39 తనోతి = వ్యాపింపజేయుచున్నాడు/ది

40 తిష్ఠతి = నిల్చున్నాడు/ది

41 దదాతి = ఇచ్చుచున్నాడు/ది

42 దదతి = ఇచ్చుచున్నారు

43 దధాతి = ధరించుచున్నాడు/ది

44 దండయతి = శిక్షించుచున్నాడు/ది

45 ద్రఢయతి = గట్టిపరచుచున్నాడు/ది

46 దృశ్యతే = కనబడుచున్నాడ/ది

47 నశ్యతి = నశించుచున్నాడు/ది

48 పశ్యతి = చూచుచున్నాడు/ది

49 పరివర్తయతి = మార్పుచేయుచున్నాడు/ది

50 పరిత్యజతి = విడుచుచున్నాడు/ది

51 పృచ్ఛతి = అడుగుచున్నాడు/ది

52 ప్రశంసతి = కొనియాడుచున్నాడు/ది

53 పరిరక్షతి = కాపాడుచున్నాడు/ది

54 ప్రతిభాతి = తోచుచున్నది

55 ప్రతీక్షతే = ఎదురుచూచుచున్నాడు/ది

56 పూరయతి = నింపుచున్నాడు/ది

57 బోధయతి = బోధించుచున్నాడు/ది

58 బ్రవీతి = పలుకుచున్నాడు/ది

59 బిభర్తి = భరించుచున్నాడు/ది

60 భణతి = మాట్లాడుచున్నాడు/ది

61 మన్యతే = తలచుచున్నాడు/ది

62 మంత్రయతే = ఆలోచించుచున్నాడు/ది

63 ముంచతి = విడుచుచున్నాడు/ది

64 మోషయతి = విడిపించుచున్నాడు/ది

65 మోదతే = సంతోషించుచున్నాడు/ది

66 యచ్ఛతి = ఇచ్చుచున్నాడు/ది

67 యతతే = ప్రయత్నించుచున్నాడు/ది

68 యాచతే = యాచించుచున్నాడు/ది

69 యుజ్యతే = తగియున్నాడు/ది

70 రక్షతి = రక్షించుచున్నాడు/ది

71 రచయతి = కూర్చుచున్నాడు/ది

72 (వి)రాజతే = ప్రకాశించుచున్నాడు/ది

73 రుణద్ధి = అడ్డగించుచున్నాడు/ది

74 రోచతే = ఇష్టమగుచున్నాడు/ది

75 లభ్యతే = పొందబడుచున్నాడు/ది

76 లిఖతి = వ్రాయుచున్నాడు/ది

77 వక్తి = మాట్లాడుచున్నాడు/ది

78 వదతి = ,, ,,

79 వహతి = మోయుచున్నాడు/ది

80 వర్ధతే = వృద్ధిపొందుచున్నాడు/ది

81 వసతి = నివసించుచున్నాడు/ది

82 వర్ణయతి = వర్ణించుచున్నాడు/ది

83 వాంఛతి = కోరుచున్నాడు/ది

84 విద్యతే = ఉన్నాడు/ది
85 విశతి = ప్రవేశించుచున్నాడు/ది
86 విజ్ఞాపయతి = విన్నవించుచున్నాడు/ది
87 విరమతి = చాలించుచున్నాడు/ది
88 వేత్తి = తెలిసికొనుచున్నాడు/ది
89 శాస్తి = శాసించుచున్నాడు/ది
90 శిక్షయతి = నేర్పుచున్నాడు/ది
91 శోచతి = విచారించుచున్నాడు/ది (Sorrow)
92 శృణోతి = వినుచున్నాడు/ది
93 సంచాలయతి = నడుపుచున్నాడు/ది
94 సహతే = ఓర్చుచున్నాడు/ది
95 సాధయతి = సాధించుచున్నాడు/ది
96 స్పర్ధతే = పోటీపడుచున్నాడు/ది
97 సిధ్యతి = సిద్ధించుచున్నది
98 హసతి = నవ్వుచున్నాడు/ది
99 హరతే = హరించుచున్నాడు/ది
100 హృష్యతి = సంతోషించుచున్నాడు/ది

ఈ విధముగా వార్తలలోను, వ్యవహారములోను ప్రయోగింపబడు క్రియా పదములలో ముఖ్యములైనవానివి 100 క్రియాపదములనేరి వాని యర్థముల నిచ్చినాను. ఇవికేవలము వర్తమానకాల బోధకములు. ప్రథమ పురుషలో ఏక వచన రూపములు మాత్రమే. వీనికి తక్కిన వచనములలో, పురుషలలో రూపములు, ఇతర కాలములందలి రూపములు, పూర్వము వాక్యముల వివ రణముల వద్ద చూపబడిన వానినిబట్టియు, మరియుఅనుబంధములో చూపినవానిని బట్టియు తెలియవలెను. వ్రాసినయన్నింటిని ఇక్కడ పట్టికగాచూపినచో గ్రంథ మంతయు పద పట్టికగా మారును. కావునపాఠకులు పై క్రియారూపములాధార ముగా, ఇతర రూపములను స్వయముగాఅనుబంధ సహాయముతో గ్రహించుటకు ప్రయత్నింతురుగాక.

ఇక కొన్ని ముఖ్యములైన సుబంతశబ్దములను వాని అర్థములను ప్రదర్శింతును. ఈ పదములు సంస్కృత వార్తల నర్థము చేసికొనుటలో ఉపయోగపడును. వీనిలో ఎక్కువ భాగము విశేషణములే, అవి మూడులింగములలోను ఉండును. ఉదా॥ అనివార్యమ్=వారించుటకు శక్యముకానిది ఇది నపుంసకలింగశబ్దము. పుంలింగములో "అనివార్యః" అని, స్త్రీ లింగములో 'అనివార్యా' అనియు ఉండును. ఇట్లే తక్కిన విశేషణములకు, ఒక లింగములోని శబ్దమును చూపిన తక్కిన వానిని గుర్తింపవలెను.

| | పదము | లింగము | అర్థము |
|---|---|---|---|
| 1 | అతిక్రాంతమ్ | (న) | అతిక్రమింపబడినది |
| 2 | అనావృతా | (స్త్రీ) | ఆవిష్కరింపబడినది |
| 3 | అనివార్యమ్ | (న) | తప్పనిసరి అయినది |
| 4 | అనుష్ఠితమ్ | (న) | ఆచరింపబడినది |
| 5 | అపరిహార్యమ్ | (న) | విడుచుటకు వీలుకానిది |
| 5 | అభ్యనుజ్ఞాతః | (పుం) | అనుమతింపబడినవాడు |
| 7 | అభినంద్యమ్ | (న) | కొనియాడదగినది |
| 8 | అభ్యుపగతః | (పుం) | అంగీకరింపబడినది |
| 9 | అవధేయమ్ | (న) | శ్రద్ధ చూపదగినది |
| 10 | అవాప్తమ్ | (న) | పొందబడినది |
| 1 | ఆకారితః | (పుం) | పిలువబడి వాడు. |
| 2 | ఆచరణీయమ్ | (న) | చేయదగినది |
| 13 | ఆపాదితాః | (పుం) | ఆరోపింపబడినవి |
| 14 | ఆమంత్రితః | (పుం) | వీడ్కోలివ్వబడెను |
| 15 | ఆశంకనీయమ్ | (న) | అనుమానింపదగినది |
| 16 | ఆశ్వాసితమ్ | (న) | హామీఇవ్వబడినది |
| 17 | ఉక్తమ్ | (న) | చెప్పబడినది |
| 18 | ఉద్బోధితాః | (పుం) | హెచ్చరింపబడిరి |

| | | | |
|---|---|---|---|
| 19 | ఉద్ఘోషితమ్ | (న) | ప్రకటింపబడినది |
| 20 | ఉపస్థితాః | (పుం) | వచ్చియున్నవారు |
| 21 | ఉపసంహృతః | (పుం) | చాలించబడినది |
| 22 | కరణీయమ్ | (న) | చేయదగినది |
| 23 | కారితాని | (న) | చేయింపబడినవి |
| 24 | కార్యమ్ | (న) | చేయదగినది |
| 25 | కృతవాన్ | (పుం) | చేసినవాడు |
| 26 | క్రీతాని | (న) | కొనబడినవి |
| 27 | గవేషితాః | (పుం) | వెతుకబడినవి |
| 28 | గృహీతః | (పుం) | గ్రహింపబడినది |
| 29 | చాలితః | (పుం) | నడుపబడినది |
| 30 | చిరాయితమ్ | (న) | ఆలస్యముచేయబడినది |
| 31 | చింతనీయమ్ | (న) | విచారింప దగినది |
| 32 | చేయః | (పుం) | సేకరింపదగినది |
| 33 | జ్ఞాతవ్యమ్ | (న) | తెలియదగినది |
| 34 | దత్తమ్ | (న) | ఈయబడినది |
| 35 | దండితః | (పుం) | శిక్షింపబడినాడు |
| 36 | నిగదితమ్ | (న) | పలుకబడినది |
| 37 | నియుక్తః | (పుం) | నియమింపబడినాడు |
| 38 | నిరాకృతమ్ | (న) | తిరస్కరింపబడినది |
| 39 | నిర్దిష్టమ్ | (న) | నిర్దేశింపబడినది |
| 40 | నిర్యాపితాని | (న) | దిగుమతిచేయింపబడినవి |
| 41 | నిర్వాచితః | (పుం) | ఎన్నుకొనబడినాడు |
| 42 | నిషిద్ధః | (న) | నిషేధింపబడినది |
| 43 | పరిసమాప్తమ్ | (న) | ముగించబడినది |
| 44 | పరిగణితమ్ | (న) | లెక్కింపబడినది |
| 45 | పాలనీయా | (స్త్రీ) | కాపాడదగినది |

| | | | |
|---|---|---|---|
| 46 | ప్రకాశితమ్ | (న) | వెలువరించబడినది |
| 47 | ప్రత్యాగతః | (పుం) | తిరిగివచ్చినాడు |
| 48 | ప్రదర్శితమ్ | (న) | చూపింపబడినది |
| 49 | ప్రయతితవ్యమ్ | (న) | ప్రయత్నించపదగినది |
| 50 | ప్రవిష్టః | (పుం) | ప్రవేశించినది |
| 51 | ప్రశంసితా | (స్త్రీ) | కొనియాడబడినది |
| 52 | భణితమ్ | (న) | చెప్పబడినది |
| 53 | మన్యమానః | (పుం) | తలచుచున్నవాడు |
| 54 | మిలితవాన్ | (పుం) | కలిసినవాడు |
| 55 | వర్ధాపితాః | (పుం) | వృద్ధిపొందింపబడినవి |
| 6 | విచారితః | (పుం) | ఆలోచింపబడినది |
| 7 | వితరితాని | (న) | దానముచేయబడినవి |
| 8 | విమోచితమ్ | (న) | విడిపింపబడినది |
| 9 | విహితః | (పుం) | చేయబడినది |
| 0 | వ్యాహృతమ్ | (న) | పలుకబడినది |
| 61 | సంవర్ధితమ్ | (న) | పెంపొందింపబడినది |
| 62 | సంధారణీయః | (పుం) | బాగుగాధరింపదగినది |
| 63 | సమాధేయా | (స్త్రీ) | సమాధానముచెప్పదగినది |
| 64 | సమవేతాః | (పుం) | ఒకచోట కూడినవారు |
| | సమాయోజితః | (పుం) | ఏర్పాటు చేయబడినది |
| | సమాహూతః | (పుం) | పిలువబడినవాడు |
| 67 | సన్నద్ధా | (స్త్రీ) | సిద్ధమయినది |
| 68 | స్మారితః | (పుం) | జ్ఞాపకముచేయబడినది |
| 69 | స్వీకృతాః | (పుం) | స్వీకరింపబడినవి |
| 70 | స్పష్టీకృతమ్ | (న) | స్పష్టముచేయబడినది |
| 71 | స్థగితమ్ | (న) | నిలిపివేయబడినది |
| 72 | స్వాయత్తీకృతా | (స్త్రీ) | స్వాధీనము చేసికొనబడినది |

73 సభాజితః (పుం) పూజింపబడినవాడు

74 సంకేతితమ్ (న) గుర్తు పెట్టబడినది

75 హస్తాక్షరాంకితః (పుం) సంతకము చేయబడినది

1 పుం=పుంలింగము 2 స్త్రీ=స్త్రీలింగము 3 న=నపుంసకలింగము అని గ్రహింపవలెను.

## కొన్ని ముఖ్యములైన అవ్యయములు

పదము అర్థము

1 అతిక్రమ్య = దాటి, అతిక్రమించి

2 అధికృత్య = ఉద్దేశించి 

3 అనుసృత్య = అనుసరించి 

4 అనుష్ఠాతుమ్ = చేయుటకు, అమలుపరచుటకు

5 అవలోకయితుమ్ = చూచుటకు 

6 అవలంబ్య = అవలంబించి 

7 అవరుధ్య = అడ్డగించి

8 అంగీకృత్వ = ఒప్పుకొని, సమ్మతించి

9 ఆయాతయితుమ్ = దిగుమతి జరుపుకొనుటకు

10 ఆరబ్ధుమ్ = మొదలుపెట్టుటకు

11 ఆలక్ష్య = ఉద్దేశించి

12 ఉరరీకృత్య = అంగీకరించి

13 ఏకీభూయ = ఒకటిగా అయి

14 కర్తుమ్ = చేయుటకు

15 గ్రహీతుమ్ = గ్రహించుటకు

16 జ్ఞాపయితుమ్ = తెలియజేయుటకు

17 ద్రఢయితుమ్ = గట్టిపరచుటకు

18 నిర్మాతుమ్ = నిర్మించుటకు

19 నిర్మాయ = నిర్మించి

20 నియంత్రితుమ్ = అణచుటకు, నిగ్రహించుటకు

21 నిర్వోఢుమ్ = నిర్వహించుటకు

22 నివారయితుమ్ = వారించుటకు

23 పరిణమయితుమ్ = మార్పునొందించుటకు

24 పరిసమాప్య = ముగించి

25 పృథక్ కర్తుమ్ = వేరుచేయుటకు

26 ప్రదాతుమ్ = ఇచ్చుటకు

27 ప్రదర్శయితుమ్ = చూపించుటకు

28 ప్రస్థాయ = బయలుదేరి

29 ప్రేరయితుమ్ = ప్రేరేపించుటకు

30 భవితుమ్ = అగుటకు

31 మంత్రయిత్వా = ఆలోచించి

32 రక్షితుమ్ = రక్షించుటకు

33 లిఖితుమ్ = వ్రాయుటకు

34 విచింత్య = ఆలోచించి

35 విజిత్య = జయించి

36 విభజయితుమ్ = విడదీయుటకు, చీల్చుటకు

37 విధాతుమ్ = చేయుటకు

38 విధాయ = చేసి

39 వినాశయితుమ్ = నశింపజేయుటకు

40 విహాయ = విడిచి

41 సమర్పయితుమ్ సమర్పించుటకు

42 సమాధాతుమ్ = బదులు చెప్పుటకు

43 సమర్థయితుమ్ = సమర్థించుటకు

44 స్థాపయితుమ్ = స్థాపించుటకు

45 స్పర్ధితుమ్ = పోటీపడుటకు

46 స్మృత్వా = తలచి, స్మరించి

47 స్వీకృత్య = స్వీకరించి

48 సంప్రేర్య = ప్రేరేపించి

49 సంభూయ = కలిసికట్టుగా

57 హృత్వా = హరించి; తీసికొని:



# సంస్కృత వార్తా క్రియాదర్పణము

## రెండవ ప్రకరణము

### అనుబంధము 1

సంస్కృత క్రియల విశేష పరిచయము.

క్రియలను బోధించు మూలరూపములు (Roots) ధాతువులు అనబడును వాని మీద వచ్చిచేరు క్రియా విభక్తి ప్రత్యయములకు "తిఙ్"లు అనిపేరు. అవి అంతమందు కలవి తిఙంతములనబడును. తిఙ్ అనునది ప్రత్యాహారము ప్రత్యాహారమనగా, ఒక సముదాయమును గ్రహింప వలసినప్పుడు, ఒకదాని చివరి వర్ణముతో ఆ సముదాయముయొక్క మొదటి వర్ణమును కలిపి పలుకుట. అప్పుడది ఆ రెండువర్ణముల మధ్యలోని వానిని మరియు మొదటి యక్షరమును బోధించును. అచ్, హల్ మొదలగునవి ఆవిధముగా ఏర్పడిన ప్రత్యాహారములే ప్రస్తుతము తిఙ్ ప్రత్యాహార మెట్లేర్పడినదో చూడుడు.

| | | | |
|---|---|---|---|
| తిప్ | తస్ | ఝి | ప్రథమ పురుష |
| సిప్ | థస్ | థ | మధ్యమ పురుష |
| మిప్ | వస్ | మస్ | ఉత్తమ పురుష |

(ఈ 9 పరస్మైపద పత్యయములు)

| | | | |
|---|---|---|---|
| త | ఆతామ్ | ఝ | ప్రథమ పురుష |
| థాస్ | ఆథామ్ | ధ్వమ్ | మధ్యమ పురుష |
| ఇట్ | వహి | మహిఙ్ | ఉత్తమపురుష |

ఇవి 9 ఆత్మనేపద ప్రత్యయములు.

పై ప్రత్యయములలో మొదటిదైన "తిప్" లోని "తి" అను దానిని "మహిఙ్" అను చివరి ప్రత్యయమునందలి "ఙ్"తో కలుపగా "తిఙ్" అను ప్రత్యాహారమేర్పడినది. దానివలన తిఙ్ అనగా పైనజూపిన 18 ప్రత్యయములు అర్థమగును. ఇవి అంతమునగల క్రియా పదములే తిఙంతములని వ్యవహరింపబడును.

పై ప్రత్యయములలో మొదటి తొమ్మిది పరస్మైపది ధాతువుల మీదను, తక్కిన తొమ్మిది ఆత్మనేపది ధాతువుల మీదను వచ్చును.

పైన చూపిన ప్రత్యయములలో ఒక్కొక్క వరుసయందు మూడేసి ప్రత్యయములుండలవు. అవి క్రమముగా ఏకవచనము, ద్వివచనము, బహువచనముగా గ్రహింపవలెను. మొదటివరుస ప్రథమ పురుష యనియు, రెండవ వరుస మధ్యమ పురుష యనియు, చివరి వరుస ఉత్తమ పురుషగాను వ్యవహరింప బడును. ఇట్లే ఆత్మనేపద ప్రత్యయములకు గూడ తెలియదగును.

ఈమూడు పురుషలలో తాను లేక తాము కర్తగాఉన్న క్రియాపదము ఉత్తమ పురుషలో (First Person) నున్నదనియు, నీవు మరియు మీరు అనుపదములు కర్తగా గలవి మధ్యమపురుష క్రియలనియు (Secound Person) పై రెండింటికంటె భిన్నమైనది యేది కర్తగా నున్నను అది ప్రథమ పురుష (Third Person) యనియు వ్యవహరింపబడును.

ఆధునిక భారతీయ భాషలన్నిటిలోను ఏకవచనము, బహువచనము మాత్రమే ఉండగా, సంస్కృత భాషలో "ద్వివచనము" అధికముగా కలదు. ఇద్దరిని లేక రెండిటిని గూర్చి చెప్పుటకు ద్వివచనము ప్రయోగింపబడును.

ఉదా॥ 1 అహం పుస్తకం పఠామి = నేను పుస్తకమును చదువుచున్నాను. ఉత్తమపురుష ఏకవచనము.

2 ఆవాం పుస్తకం పఠావః = మేమిద్దరము పుస్తకమును చదువుచున్నాము. ఉత్తమ పురుష ద్వివచనము.

3 వయం పుస్తకం పఠామః = మేము పుస్తకమును చదువుచున్నాము. ఉత్తమ పురుష బహువచము.

ఇదే విధముగా ప్రథమ, మధ్యమ పురుషలకుగూడ పురుషవచనములను మున్ముందు ఉదాహరణములద్వారా గ్రహింపవచ్చును.

పై యుదాహరణ వాక్యములు వర్తమాన కాలమునకు సంబంధించినవి, తిజ్ ప్రత్యయమును భూత, భవిష్యద్వర్థమానార్థములందును, విధి, ఆశీస్సు. ప్రార్థన మొదలగు నర్థములందును, ఆ యా ధాతువులమీద చేరినప్పుడు భిన్న భిన్న రూపములను పొందును. వానినిగూర్చి ముందు వివరింపబడును.

వ్యాకరణ ప్రణాళిక ననుసరించి సౌకర్యార్థము ధాతువులన్నియు పది గణములుగా విభజింపబడినవి. ఒక్కొక్క గణమున కొక వికరణ సంజ్ఞ (Conjugationel Sign) గలదు.

1 మొదటిది భ్వాదిగణము. "భూ" ధాతువు మొదటగలదగుటచే (భూ + ఆది) దీనికీపేరు కలిగెనది. ఇందలి ధాతువులకు "శప్" అను వికరణ ప్రత్యయము వచ్చును. ఇది ధాతువునకు మరియు క్రియావిభక్తికిని మధ్యలో చేరును. శప్‌లో శకారము మరియు పకారము ఇత్సంజ్ఞచే లోపింపగా "అ" మాత్రము మిగులును. "ఇత్" అనగా, సూత్రములో చెప్పినప్పుడు వినబడి తరువాత లోపించి లక్ష్యములలో కాన్పించని వర్ణమునకు సంజ్ఞ.

భూ + అ + తి > భో + అ + తి = భవతి

భూ = ధాతువు, అ = శప్ వికరణము, తి = క్రియావిభక్తి ప్రత్యయము "భవతి" అనునది భూ ధాతువు యొక్క వర్తమానార్థక రూపము.

2 రెండవది అదాది గణము, "అద్" ధాతువు ఈగణములో మొదటిది (అద్ + ఆది = అదాది) ఇందలి ధాతువులకు వికరణ ప్రత్యయమేదియు

ఉండదు. శప్ ప్రత్యయమువచ్చి లోపించునని వ్యాకరణము చెప్పును. కనుక వీనిలో ధాతువునకు అవ్యవధానముగనే తిఙ్ ప్రత్యయము చేరుచుండును.

అద్ + తి = అత్తి; హన్ + తి = హన్తి మొదలగునవి.

3 మూడవది జుహోత్యాది గణము. హు ధాతువు వీనిలో మొదటిది. ఇందలి ధాతువులకు గూడ "శప్" వికరణ ప్రత్యయము లోపించును. కాని ఈ గణము లోని ధాతువులకు ద్విత్వము వచ్చుట విశేషము ఉదా॥ హు + హు + తి > జుహు + తి = జుహోతి.

4 దివాదిగణము నాల్గవది, 'దివ్' అను ధాతువు ఈ గణమున మొదటిది. ఇందలి ధాతువులకు 'శ్యన్' అను వికరణ ప్రత్యయము చేరును. 'శ్యన్' లో శకారనకారములకు ఇత్సంజ్ఞవలన లోపము కలుగగా 'య' మాత్రము మిగులును. ఉదా॥ దివ్ + య + తి > దీవ్ = య + తి = దీవ్యతి,

5 'సు' అను ధాతువు ఆదియందు గల స్వాదిగణము 5వది. దీనియందలి ధాతువులకు వికరణ ప్రత్యయము "శ్ను" అనునది. దీనిలో 'ను' మాత్రమే మనకు లక్ష్యములలో కాన్పించును. ఉదా॥ సు + ను + తి > సు + నో + తి = సునోతి.

6 ఆరవది తుదాదిగణము. 'తుద' ధాతువు ఈ గణములో మొదటిది. ఇందు లోని ధాతువులకు 'శ' అనునది వికరణ ప్రత్యయము. ఇది 'అ'గా మిగులును, శకారము ఇత్తు. ఉదా॥ తుద్ + అ + తి = తుదతి

7 'రుధ్' ధాతువు ఆదియందుగల ధాతువులగణము రుధాదిగణము 7వది. దీని లోని ధాతువులకు వికరణ ప్రత్యయము 'శ్నమ్' అనునది. దీనిలో శకార, నకారములు ఇత్సంజ్ఞచే లోపించి 'న' మాత్రము మిగులును. కాని యిది ధాతువులోని చివరియచ్చునకు పరముగా వచ్చును. ఉదా॥ రుధ్ + తి > రుణధ్ + తి = రుణద్ధి మొ॥

8 ఎనిమిదవది తనాదిగణము. 'తన్' ధాతువుతో ఇది ప్రారంభమగును. దీని వికరణము "ఉ". ఉదా॥ తన్+ఉ+తి> తన్+ఓ+తి=తనోతి. ఉకారము గుణమువలన ఓకారమయినది.

9 'క్రీ' ధాతువుతో ప్రారంభమగు క్ర్యాదిగణము తొమ్మిదవది. ఇందలి ధాతువులకు 'శ్నా' అనునది వికరణ ప్రత్యయము. దీనిలో శకారము ఇత్తుకాగా 'నా' అనునది మాత్రము మిగులును.

ఉదా॥ క్రీ+నా+తి> క్రీ+ణా+తి = క్రీణాతి. ర,ష ల తరువాత వచ్చు 'న' 'ణ' గా మారును.

10 చురాదిగణము పదవది మరియు చివరిదికూడ. 'చుర' ధాతువుతో ఈ గణము ప్రారంభమగును. దీనిలోని ధాతువులకు 'ణిచ్', 'శప్' అను రెండు వికరణ ప్రత్యయములుకూడ వచ్చును, 'ణిచ్' లో ణకార చకారములు ఇత్తులుకాగా 'ఇ' మాత్రము మిగులును. 'శప్'లో'అ' శేషించునని పూర్వమే చెప్పబడినది

ఉదా॥ చుర్+ఇ+అ+తి > చోర్+ఏ+అ+తి= చోరయతి. ధాతువులోని ఉకారమునకు, ణిచ్ యొక్క ఇకారమునకు గూడ గుణమువచ్చి పై రూపము సిద్ధించినది.

ఈ విధముగా, ధాతువులన్నియు పైన జూపిన పదిగణములుగా విభజింపబడినవి, 'తిఙ్' ప్రత్యయములు (క్రియావిభక్తులు) అన్నిటికి సమానమే అయినను, ఆయాగణములలో, ఆయాకాలములలో క్రియారూపములు భిన్నముగా నుండును.

ధాతువులు — పరస్మైపది, ఆత్మనేపది, ఉభయపది అను మూడు రకములుగా నుండును. క్రియాఫలము తనను గాక ఇతరులను పొందినచో పరస్మైపదరూపమును, కర్తనే పొందినచో ఆత్మనేపదరూపమును ప్రయోగించవలెనని పాణిని వ్యాకరణము చెప్పుచున్నది. ఈ నియమము ఉభయపది

(పరస్మైపది, ఆత్మనేపది - రెండురూపములు కలవి) ధాతువుల విషయముననే సాధ్యమగును. కేవల పరస్మైపదులకుగాని, కేవలాత్మనేపదులకుగాని వీనిని వర్తింపజేయుట కుదరదు. ఎట్లనగా 'పచ్' ధాతువు ఉభయపది కనుక, సః అన్నం పచతి = అతడు అన్నమును వండుచున్నాడు. "పచతి" పరస్మై పద రూపము కనుక ఇతరులకొరకు వండుచున్నాడని యర్థము. "సః అన్నం పచతే" అను వాక్యములో "పచతే" అనునది ఆత్మనేపద రూపము కనుక "అతడు అన్నమును వండుకొనుచున్నాడు" అని యర్థము చెప్పవలసియుండును. కాని యీ విధమైన వ్యవహారనియమము బహుకాలము క్రిందటనే భ్రష్టమైనది.

## దశ లకారములు

ధాతువుల మీద క్రియావిభక్తులు చేరుటకుముందు, కాలభేదములను, విధ్యాద్యర్థములను బోధించుటకు పది లకారములు కలవు. అవి క్రమముగా 1. లట్ 2. లిట్ 3 లుట్ 4. ల్కృట్ 5. లేట్ 6. లోట్ 7. లఙ్ 8. లిఙ్ 9. లుఙ్ 10. ల్కృఙ్ అనునవి.

వీనిలో "లట్" అనునది వర్తమానార్థమును (Present tense) బోధించును. లిట్, లఙ్, లుఙ్ అను మూడు లకారములు భూతకాలమును (Past tense) లుట్, ల్కృట్, ల్కృఙ్ అనునవి భవిష్యత్కాలమును (Future tense) బోధించును. లిఙ్, లోట్ అను లకారములు విధి, ప్రార్థన, ఆశీస్సు మొదలగు అర్థములను బోధించును. వీనిలో లేట్ అనునది కేవలము వేద భాషలో మాత్రమే కన్పించును. తక్కిన 9 లకారములు లోక, వేదభాషల యందుపయోగింపబడును.

వీనిలో వర్తమానార్థములో ఒక్క లకారము మాత్రమే ఉండగా, భూతభవిష్యత్కాలములను బోధించుటకు మూడేసి లకారములున్నవి అనదగ్గ

తన భూతమునకు లజ్. అనద్యతన పరోక్షభూతమునకు లిట్ సామాన్య భూతమునకు లుజ్ ప్రయోగింపబడును అట్లే అనద్యతన భవిష్యత్తునకు లుట్, సామాన్యభవిష్యదర్థములో లృట్ హేతు హేతుమద్భావమున (conditional) లృజ్ అను లకారములు వాడబడును:

భూత, భవిష్యత్కాలములందు అద్యతన, అనద్యతన భేదము కలదు. అద్యతన భూతమనగా గడచిన అర్ధరాత్రినుండి వాక్యప్రయోగకాలము వరకు మధ్యనున్నకాలము దానికి భిన్నమైనది అన్యతన భూతము. అదే విధముగా తత్కాలము (వాక్యప్రయోగకాలము) నుండి రాబోవు అర్ధరాత్రికి మధ్యనుండు కాలము, అద్యతన భవిష్యత్తు. ఆ తరువాత జరుగబోవునదంతయు అనద్యతన విష్యత్కాలము. లిట్ అను లకారమును అనద్యతనములోగూడ పరోక్ష గాతమునందే ప్రయోగింపవలెను. అనగా వక్తకు ఆక్రియ పరోక్షమందు రిగినదై యుండవలెను. ఉదా॥ పురాదశరథోనామ రాజాబభూవ (పూర్వము శరథుడను రాజుండెడివాడు). ఇచట దశరథుని ఉనికిని చూడని వ్యక్తి యీవాక్యము ప్రయోగింపవలెను. సామాన్యభూతము, సామాన్యభవిష్యత్తు అనగా అన్ని విధముల (అద్యతన, అనద్యతన, పరోక్ష) భూతభవిష్యత్తులని యర్థము.

ఇక భవిష్యత్తులో హేతు హేతుమద్భావ మనగా కార్యకారణ సంబంధము, ఒకటి కార్యముగా, మరొకటి కారణముగా రెండు క్రియలు ప్రయోగింపబడి, భవిష్యదర్థమున్నచో లృజ్ ప్రయోగింపదగును.

ఉదా॥ సువృష్టిశ్చేద భవిష్యత్ర్హి సుభిక్షమ భవిష్యత్

(మంచి వర్షము పడినచో పంటలు బాగుగా పండును)

ఇక్కడ వర్షము పడుట కారణము, పంటలు పండుట కార్యము. రెండు క్రియలకుగూడ లృజ్ రూపములు ప్రయోగింపబడినవి. దీనిని ఆంగ్లములో (Conditional mood) అందురు.

విధి, నిమంత్రణము, ప్రార్థన ఆశీస్సు మొదలగు అర్థములందు లిఙ్ మరియు లోట్ ప్రయోగింపబడును ఆజ్ఞాపించుట, భోజనాదులకు పిలుచుట, ప్రార్థించుట, దీవించుట అనునవి పైమాటలకర్థము. అన్ని యర్థములందును, లోట్ రూపములు సమానములే. కాని 'లిఙ్' లో మాత్రము విధ్యాద్యర్థము లందు ఒక విధమగు రూపములు, ఆశీస్సునందు మాత్రము ప్రత్యేకరూపములు కలవు కావున సామాన్యముగా విధిలిఙ్ ఆశీర్లిఙ్ అని ఆరెంటిని వ్యవహరింతురు 'లేట్' లోకభాషలో లేకున్నను లిఙ్ లోని యీ రెండు భేదములవలన మరల 10 లకారములయినవి.

(1) వర్తమాన కాలబోధకమగు 'లట్' లో పరస్మైపదిధాతు రూపము లిట్లుండును:— (Present tense)

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్రథమపురుష | పఠతి | పఠతః | పఠంతి |
| మధ్యమపురుష | పఠసి | పఠథః | పఠథ |
| ఉత్తమపురుష | పఠామి | పఠావః | పఠామః |

పై రూపములు భ్వాదిగణములోని పఠ్ ధాతువునకు సంబంధించినవి. ఇతరగణములలోని ధాతువులకు కొలది మార్పులతో లట్ రూపములుండును.

తిప్, సిప్, మిప్ అను మూడు ఏకవచన ప్రత్యయములలో తి, సి, మి అనునవి రూపములందు వినబడును. సాధారణముగా పదాంతమందున్న సకారము విసర్గగా మారును కనుక తస్, థస్, వస్, మస్ అనునవి ,తః, థః, వః, మః అని మారినవి. ప్ర.పు. బహువచనము "ఝి" అంతిగా మారుట ఒక విశేషము. ఉత్తమపురుష ఏకవచనములో 'మి'కి పూర్వమందున్న అకారము దీర్ఘముగా మార్పుచెందును.

పఠ్ + అ + తి = పఠతి. ధాతువు, పఠ్; శప్, వికరణము (అ) క్రియా విభక్తి ఇట్లే తక్కినవచనములు తెలియవలెను.

వికరణ ప్రత్యయములోపించు రెండవగణములో లట్ రూపములు—
(పరస్మైపదిధాతువు)

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అత్తి | అత్తః | అదంతి |
| మ.పు. | అత్సి | అత్థః | అత్థ |
| ఉ.పు. | అద్మి | అద్వః | అద్మః |

ఈ గణములో ధాతువు+విభక్తి మాత్రమే ఉండును.

అద్+తి=అత్తి మొదలగునవి. లట్‌కు సంబంధించినంతవరకు అన్ని గణముల ధాతువులలోను అంతమందుండు ప్రత్యయముల రూపములు దాదాపు సమానముగనే యొండును.

ఇక ఆత్మనేపది ధాతువులకు 'లట్' రూపములిట్లుండును :—

| | ఏక | ద్వి | బహు |
|---|---|---|---|
| ప్ర.పు. | లభతే | లభేతే | లభంతే |
| మ.పు. | లభసే | లభేథే | లభద్వే |
| ఉ.పు. | లభే | లభావహే | లభామహే |

'లభ' ధాతువు భ్వాది గణములోనిది. దీనిలో త, ఆతామ్, ఝ అను ప్రథమపురుష ప్రత్యయములు క్రమముగా తే, ఇతే, అంతే అనురూపమును బొందును, మధ్యమపురుషలో థాస్, 'సే' గాను. ఆథామ్, ధ్వమ్ అనునవి ఇధే, ధ్వే" అను రూపమును, ఉత్తమపురుషలోని 'వహి,మహి' అనునవి వహే,మహే అనియును మార్పుజెందును, ఏకవచనములో సంధిమాత్రము జరుగును. (లభ+ఇ=లభే) ఆత్మనేపద లట్‌రూపము లన్నింటిలోను ఏకారము తప్పక కాన్పించుట విశేషము. తక్కినగణములలో గూడ అత్మనేపద రూపములు లట్‌లో కొలది ఏర్పులతో నుండును.

ఉభయపది ధాతువులకు పరస్మైపది, ఆత్మనేపది రెండు విధముల రూపములుండును.

2 పరోక్ష భూతకాలమును బోధించు లిట్ రూపములను (Perfect past) పరిశీలింతము.

ఈ లకారములో ధాతువునకు ద్విత్వమువచ్చును. ద్విత్వములోని పూర్వభాగమునకు అభ్యాసమనిపేరు. ద్విత్వము వచ్చిన తరువాత కొన్ని అభ్యాస కార్యములు కూడ జరుగును.

భూ ధాతువు లిట్ రూపములు :-

| | | |
|---|---|---|
| బభూవ | బభూవతుః | బభూవుః |
| బభూవిథ | బభూవథుః | బభూవ |
| బభూవ | బభూవివ | బభూవిమ |

లిట్,లో తిప్ మొదలగు పరస్మైపద ప్రత్యయములకు వరుసగా;

| | | |
|---|---|---|
| ణల్ (అ) | అతుస్ | ఉస్ |
| థల్ (థ) | అథుస్ | అ |
| ణల్ (అ) | వ | మ |

అనునవి ఆదేశముగా వచ్చును.

ప్రక్రియ యీ క్రమములో నుండును.

భూ + లిట్ > భూ + తి > భూ + అ > భూ భూ + అ > భ భూ + అ > బభూవ్ + అ బభూవ. ఇట్లే ఇతర వచనములందును తెలియవలెను.

ద్విత్వము వచ్చినప్పుడు అభ్యాసములోని కవర్గ, హకారములకు చవర్గమాదేశమగును.

ఉదా॥ గద్ + గద్ + అ > గగద్ + అ > జగద్ + అ = జగాద

హృ + హృ + అ > హర్ హర్ + అ = జహార

పై లిట్ రూపములలో థ,వ,మ అను ప్రత్యయములకు ముందు ఇకారము ఆగమముగా వచ్చును. వలాదియగు అర్ధధాతుక ప్రత్యయమునకు 'ఇట్' ఆగమముగా వచ్చును.

ధాతువు మీద వచ్చు ప్రత్యయములు సార్వధాతుకములనియు. అర్ధధాతుకములనియు రెండు విధములు తిఙ్ ప్రత్యాహారములోని ప్రత్యయములు 18 (క్రియావిభక్తులు) మరియు శకారము ఇత్తుగాగల ప్రత్యయములు సార్వధాతుకములు. తక్కినవి అర్ధధాతుకములు, లిట్ స్థానమున ఆదేశముగా వచ్చిన తిఙ్ అర్ధ ధాతుకమగునని ప్రత్యేకముగా విధింపబడుటవలన పై మూడు స్థలములలో ఇడాగమము వచ్చినది. 'వల్' అనగా యకారము తక్క మిగిలిన హల్లులన్నియు.

ఆత్మనేపదిధాతువు లిట్ రూపము లిట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు | ముముదే | ముముదాతే | ముముదిరే |
| మ పు. | ముముదిషే | ముముదాథే | ముముదిధ్వే |
| ఉ. పు. | ముముదే | ముముదివహే | ముముదిమహే |

ఈ లకారములో ప్రథమపురుష ప్రత్యయములు 'త, ఆతామ్, ఝ' అనునవి 'ఏ,ఆతే, ఇరే అనియు, మధ్యమపురుషమందలి థాస్, ఆథామ్ ధ్వమ్ అనునవి "సే, ఆథే, ధ్వే" అనియు; ఉత్తమపురుష ప్రత్యయములగు "ఇట్, వహి, మహిఙ్" అనునవి "ఏ, వహే, మహే" అనియు మార్పునందును. ఇక్కడకూడ వలాదియగు అర్ధధాతుక ప్రత్యయములకు ఇకారము (ఇట్) ఆగమముగా వచ్చును.

కొన్ని ధాతువులకు లిట్‌లో ద్విత్వము రాకుండా, ఆ ధాతువుయొక్క ఉపధయగు అకారమునకు ఏ కారము వచ్చుచుండును. ఉపధయనగా చివరి వర్ణమునకు ముందరిది. అప్పుడు లిట్ రూపములు :—

| | | |
|---|---|---|
| రేమే | రేమాతే | రేమిరే |

| | | |
|---|---|---|
| రేమిషే | రేమాథే | రేమిధ్వే |
| రేమే | రేమివహే | రేమిమహే |

ఇట్లు ద్విత్వమురాక ఏత్వము వచ్చుట పరస్మైపదులలో గూడ జరుగును.

(3) మూడవలకారము లుట్-ఇది అనద్యతన భవిష్యత్కాలార్థములో ప్రయోగింపబడును. (First future)

ఈ లకారములో పరస్మైపది, ఆత్మనేపది క్రియారూపములీ క్రింది విధముగా ఉండును.

1. పరస్మైపది ధాతువులకు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | భవితా | భవితారౌ | భవితారః |
| మ.పు. | భవితాసి | భవితాస్థః | భవితాస్థ |
| ఉ.పు. | భవితాస్మి | భవితాస్వః | భవితాస్మః |

ఇది భూధాతువు రూపము. మొదటి గణములోనిది

2. ఆత్మనేపది ధాతువులకు :-

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ఏధితా | ఏధితారౌ | ఏధితారః |
| మ.పు. | ఏధితాసే | ఏధితాసాథే | ఏధితాధ్వే |
| ఉ.పు. | ఏధితాహే | ఏధితాస్వహే | ఏధితాస్మహే |

ఇదికూడ మొదటి గణములోనిదే. ఏధధాతువు లుట్ రూపములివి.

పై రెండు వర్గములలోను ప్రథమపురుష రూపములు సమానముగా నున్నవి. అన్ని ధాతువులలోను లుట్ ప్రథమ పురుష రూపములు పరస్మైపది, ఆత్మనేపది రెండింటియందును ఒకేవిధముగా నుండును. ఈ లుట్‌లో ధాతువు తరువాత "తాస్" అనునది చేరును. అది అర్ధధాతుకము, వలాది (వల్ ప్రత్యాహార వర్ణము ఆదియందుగలది) కనుక ఇడాగమము వచ్చు

చుండును. ధాతువులలో కొన్నిటికి ఇడాగమము వచ్చును. వానిని సేట్ ధాతువులు (స+ఇట్=సేట్, ఇడాగమము కలవి) అందురు. మరికొన్నిటికి 'ఇట్' రాదు. అవి "అనిట్" (న+ఇట్=అనిట్, ఇట్ రానివి) ధాతువులనబడును. ఇడాగమము వికల్పముగా వచ్చు ధాతువులు వేట్ ధాతువులనబడును. (వా + ఇట్ = వేట్: వా అనగా వికల్పము) పూర్వముదాహరింపబడిన "భవితా, ఏధితా" అను రెండును సేట్ ధాతురూపములే.

ఇడాగమము రాని ధాతువులకు రూపములు -

గమ్+తా> గం+తా> గన్+తా= గన్తా మొదలగు విధములుగా నుండును.

లుట్ ప్రథమపురుషలో ప్రత్యయములకు వరుసగా డా, రౌ, రస్ అనునవి ఆదేశమగును.

భూ+లుట్ > భూ+తి > భూ+తాస్+తి > భూ+ఇ తాస్+డా > భో+ఇతాస్+అ > భవితా+అ=భవితా.

మధ్యమ. ఉత్తమ పురుష విభక్తులలో మార్పేమీలేదు. తాస్ చేరుట మాత్రము విశేషము.

ఆత్మనేపదులలో ప్రథమపురుష వరకు పరస్మైపదము వలెనే రూపములుండును. మధ్యమపురుష ప్రత్యయములు 'సే. ఆధే' ధ్వే' అను విధముగా మార్పుజెందును. ఉత్తమపురుషలో మూడు వచనములు క్రమముగా హే, వహే, మహే అనునవి అంతమందు కలిగిఉండును.

4 సామాన్య భవిష్య దర్థక (Second future) మగు ల్ృట్ నాల్గవ లకారము. దీనిలో ధాతువునకు, విభక్తికి మధ్య "స్య" అను ప్రత్యయము చేరును. దీనికి ఇడాగమము (సేట్‌ధాతువులకు) వచ్చును. అంతమున నిలుచు ప్రత్యయ రూపములు లట్‌లో వలెనే యుండును. "స్య" వచ్చుట మాత్రమే విశేషము. ఇది ఆత్మనేపదులకు గూడ వచ్చును.

'ఌట్' పరస్మైపదరూపములు :—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | భవిష్యతి | భవిష్యతః | భవిష్యంతి |
| మ.పు. | భవిష్యసి | భవిష్యథః | భవిష్యథ |
| ఉ.పు. | భవిష్యామి | భవిష్యావః | భవిష్యామః |

(ఇకారము తరువాతనున్న స కారము ష కారముగా మారును)

ఆత్మనేపదరూపములు 'ఌట్' లో :—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | కరిష్యతే | కరిష్యేతే | కరిష్యంతే |
| మ.పు. | కరిష్యసే | కరిష్యేథే | కరిష్యధ్వే |
| ఉ.పు. | కరిష్యే | కరిష్యావహే | కరిష్యామహే |

ఇవి కృధాతు రూపములు. పై రెండు ధాతువులుకూడ సేట్ధాతువులే.

ఇడాగమములేని (అనిట్) ధాతువులకు రూపములు కొంత భిన్నముగా నుండును. ఉదా॥ పచ్ + స్య + తి > పక్ + స్య + తి > పక్ + ష్య + తి = పక్ష్యతి: పక్ష్యతః మొదలగునవి. ఇచట ధాతువు + స్య + విభక్తి ప్రత్యయము ఉండును.

5. విధి, ఆశీస్సు మొదలగు భావములను బోధించులోట్ 5వ లకారము. (Imparative mood)

ఈ లకారములో ప్రత్యయములు కొన్నిమార్పులు జెందును. 'లోట్' పరస్మైపదరూపములు :—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | భవతు / భవతాత్ | భవతామ్ | భవంతు |
| మ.పు. | భవ / భవతాత్ | భవతమ్ | భవత |
| ఉ.పు. | భవాని | భవావ | భవామ |

పై రూపములలో ప్రథమపురుషలోని తి, అంతి అనువాని ఇకారము ఉకారముగా మారుట; ప్రథమ, మధ్యమ పురుషల ఏకవచనములలో "తాత్" అను ఆదేశము వచ్చిన మరొక రూపము, ఉత్తమ పురుష ఏకవచనమగు 'మి' అనుదానికి 'ఆని' ఆదేశముగా వచ్చుట, వస్, మస్‌ల సకారము లోపించుట— ఇవి ముఖ్యములగు మార్పులు— తస్, థస్, థ అను ప్రత్యయములకు క్రమముగా తామ్, తమ్, త అనునవి ఆదేశమగును, మధ్యమపురుష ఏకవచనమునకు హి ఆదేశమై. అది అకారాంత శబ్దము తరువాత లోపించును.

ఆత్మనేపదములో లోట్ రూపములిట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర పు. | మోదతామ్ | మోదేతామ్ | మోదంతామ్ |
| మ,పు. | మోదస్వ | మోదేథామ్ | మోదధ్వమ్ |
| ఉ.పు. | మోదై | మోదావహై | మోదామహై |

ఇవి భ్వాదిగణములోని 'ముద — హర్షే' అను ధాతువు రూపములు. వీనిలో ప్రథమ పురుష మూడువచనములకు క్రమముగా "తామ్, ఇతామ్, అ" నునవియును, మధ్యమపురుష మూడు వచనములకు స్వ, ఇథామ్, ధ్వమ్ అంతామ్, అనునవియును ఆదేశముగా వచ్చుట, ఉత్తమ పురుషలో "ఇ, వహి, మహి" అను విభక్తి ప్రత్యయముల ఇకారములన్నియు ఐకారములుగా మార్పుజెందుట విశేషము. ముద్ ధాతువులోని ఉపధయగు ఉకారమునకు గుణము ఓకారము వచ్చినది. అ,ఏ,ఓ అను మూడు వర్ణములకు 'గుణ' సంజ్ఞ వ్యాకరణ ప్రసిద్ధము.

6. ఆరవలకారము లజ్. ఇది అనద్యతన భూతకాల క్రియను బోధించును. (Imperfect past) లజ్, లుజ్, ల్‌ఋజ్ అను మూడు లకారములందును ధాతువునకు ముందు "అట్" ఆగమముగా వచ్చును. దానిలో 'అ' మాత్రము రూపములందు నిలుచును.

'లజ్' లో పరస్మైపదరూపములీరీతిగా నుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు, | అభవత్ | అభవతామ్ | అభవన్ |
| మ.పు. | అభవః | అభవతమ్ | అభవత |
| ఉ.పు. | అభవమ్ | అభవావ | అభవామ |

ఈ లకారములో, తి, సి, మి అను మూడు పురుషల ఏకవచనముల ఇకారములు లోపించును. మ.పు.లో మాత్రము సకారము విసర్గగా మారును. తక్కినచోట్ల పొల్లక్షరములు మిగులును. ప్ర. పు. బహువచనమగు 'ఝి'కి అంతి అనునది ఆదేశమై, దాని యంతమందలి ఇకారము లోపింపగా, సంయోగాంతమందున్న తకారముకూడ లోపించి అన్ మాత్రము నిల్చును. ప్ర. పు ద్వివచనమగు 'తస్,' మ.పు. లోనిద్వి, బహు వచనములగు "థస్,థ" మరియు ఉ పు. ఏకవచనమగు 'మిప్' అను వానికి వరుసగా, 'తామ్, తమ్, త, అమ్' అనునవి ఆదేశములగును. వీనిలో మొదటిమూడు లోట్ లో కూడ సమానమే

ఇక 'లఙ్' ఆత్మనేపదిరూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అవర్తత | అవర్తేతామ్ | అవర్తంత |
| మ పు. | అవర్తథాః | అవర్తేథామ్ | అవర్తధ్వమ్ |
| ఉ పు. | అవర్తే | అవర్తావహి | అవర్తామహి |

పై రూపములో మూడు పురుషల ఏకవచన ప్రత్యయములందు మార్పేమీలేదు సకారము విసర్గగా మారుట సాధారణమే. ప్రథమ, మధ్యమ ద్వివచన రూపములు లోట్‌లోవలెనే యుండును. మ. పు. బహువచనములో మార్పులేదు. ఉ. పు. లో "వహి, మహి" ప్రత్యయములకు ముందున్న అకారము దీర్ఘముగా మారును. ఏకవచనములో సంధిమాత్రము జరుగును. (అవర్త+ఇ=అవర్తే)

7. ఏడవలకారమగు లిఙ్; "విధిలిఙ్, ఆశీర్లిఙ్" అని రెండుగా విభక్తమయినది. విధి, ప్రార్థన, నిమంత్రణము మొదలగు అర్థములను బోధించుటకు విధిలిఙ్, ఆశీస్సు అను అర్థమును బోధించుటకు ఆశీర్లిఙ్ ప్రయోగింప

బడును. రెంటికి వేరువేరు రూపములుండును మొదటిది సార్వధాతుకలకారము, రెండవది ఆర్ధధాతుకము. దానిని బట్టి రూపములలో మార్పులుండును

"విధిలిఙ్" లో పరస్మై పదరూపములిట్లుండును, (potential mood)

| | | |
|---|---|---|
| భవేత్ | భవేతామ్ | భవేయుః |
| భవేః | భవేతమ్ | భవేత |
| భవేయమ్ | భవేవ | భవేమ. |

విధిలిఙ్ సార్వధాతుకలకారము కనుక దీనికి వికరణ ప్రత్యయము "శప్" వచ్చును. భూ+అ+తి (ధాతువు+వికరణము+విభక్తిప్రత్యయము) అనుదశలో 'తిఙ్' పరముగా నున్నపుడు 'భవ' అను అంగమునకు యాస్ అను ఆగమము వచ్చును. తరువాత దానికి 'ఇయ్' ఆదేశముకాగా, భవ+ఇయ్+తి> భవేయ్+తి=భవేత్ అగును. సంయోగాదియగు యకారము, మరియు తి లోని ఇకారము లోపించును. 'తస్, థస్, థ, మిప్' అను ఆదేశములు వచ్చును. ప్ర.పు. బహువచనమగు 'ఝి' ప్రత్యయమునకు 'ఉస్' అనునది ఆదేశమగును. "వస్, మస్" సకారలోపము, "తి,సి"ల ఇకారము లోపించుట లఙ్ వలెనే తెలియవలెను, వికరణప్రత్యయములోపించి, అంగము అకారాంతముకానిచోట్ల యాస్ స్పష్టముగా కాన్పించును. "ఇయ్" ఆదేశము అకారాంతమగు అంగముమీదనే వచ్చును.

ఉదా॥ హన్+యాస్+తి> హన్+యాస్+త్> హన్+యా+త్ హన్యాత్. "యాస్" లో సకారము మాత్రము లోపించినది, ఇది అదాది గణములోని ధాతువు.

విధిలిఙ్ లో ఆత్మనేపదరూపములు:—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ఏధేత | ఏధేయాతామ్ | ఏధేరన్ |
| మ.పు. | ఏధేథాః | ఏధేయాథామ్ | ఏధేధ్వమ్ |
| ఉ.పు. | ఏధేయ | ఏధేవహి | ఏధేమహి |

ఇది భ్వాదిగణములోని "ఏధ" దాతువు

ఆత్మనే పదిధాతువుల "లిఙ్" నకు "సీయుట్" అను ఆగమము వచ్చును. సార్వధాతుక లిఙ్ (విధిలిఙ్) యొక్క సీయుట్ లోని సకారము లోపించును.

ఉదా॥ ఏధ్ + అ + సీయ్ + త > ఏధ + ఈయ్ + త > ఏధేయ్ + త = ఏధేత. సంయోగాది యకారమునకులోపము ప్ర.పు. బహువచనమగు 'ఝ' కు రన్ ఆదేశమగును. ఏధ + సీయ్ + రన్ > ఏధ + ఈయ్ + రన్ > ఏధ + ఈ + రన్ = ఏధేరన్. ఉ.పు. ఏకవచనమగు 'ఇట్' అనుదానికి అ ఆదేశము వచ్చును.

8. ఆశీస్సు (దీవించుట) అను అర్థమును బోధించు ఆశీర్లిఙ్ 8వ లకారము (Benedective mood) దీని యందలి విభక్తి ప్రత్యయములు అర్ధ ధాతుకములగును, 'యాసుట్' ఆగమము దీనియందు గూడ వచ్చును.

ఆశీర్లిఙ్ పరస్మైపద రూపములిట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | భూయాత్ | భూయాస్తామ్ | భూయాసుః |
| మ.పు. | భూయాః | భూయాస్తమ్ | భూయాస్త |
| ఉ.పు. | భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |

భూధాతువు రూపములివి. అర్ధధాతుకము కనుక శప్ రాదు. ధాతువు వెంటనే యాసుట్ దానితరువాత తిఙ్ ప్రత్యయములు వచ్చును. (భూ + యాస్ + తి > భూ + యాస్ + త్ > భూ + యా + త్ = భూయాత్) తి లోని ఇకారము లోపించుట, తస్, థ, మిప్' అను వానికి తామ్, తమ్, త, అను ఆదేశములు ఎప్, మస్, ల సకారలోపమును లఙ్‌లో వలెనే జరుగును.

ప్ర. పు. బహువచన ప్రత్యయమునకు, విధిలిఙ్‌లో వలె "ఉస్" ఆదేశమగును. ఈ లకారములో "యాసుట్" పూర్తిగా కాన్పించును.

ఆత్మనేపదము లో "ఆశీర్లిజ్" రూపములు ఇట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | ఏధిషీష్ట | ఏధిషీయాస్తామ్ | ఏధిషీరన్ |
| మ. పు. | ఏధిషీష్ఠాః | ఏధిషీయాస్థామ్ | ఏధిషీఢ్వమ్ |
| ఉ. పు. | ఏధిషీయ | ఏధిషీవహి | ఏధిషీమహి |

ఆశీర్లిజ్‌లో సీయుట్ కాక విభక్తిప్రత్యయమునకు ముందు సకారము ఆగమముగా వచ్చును. ఉదా॥ ఏధ్ + సీయ్ + స్ + త > ఏధ్ + ఇసీయ్ + స్ + త > ఏధ్ + ఇసీయ్ + స్ + త > ఏధ్ + ఇషీ + ష్ + త = ఏధిషీష్ట, ఇకారము ఇడాగమమునకు సంబంధించినది. ఇ వర్ణము తరువాత నుండు సకారము షకారమగుట, షకారమునకు పరమైనతకారము టకారమగుట సంధి కార్యములు. ఉత్తమపురుష ఏకవచన ప్రత్యయమునకు 'అ' ఆదేశమైనది. తక్కిన వచనములలో సంధి జరుగుట తప్ప ఇతర విశేషములులేవు.

ఇది భ్వాది గణములోని 'ఏధ = వృద్ధౌ' అను ధాతువు.

9. తొమ్మిదవ లకారము లుజ్, ఇది సామాన్య భూతకాలమును బోధించును. (Aorist)

దీనియందుగూడ ధాతువునకు పూర్వము అడాగమము (అ)చేరును.

లుజ్‌లో పరస్మైపదరూపములు క్రిందివిధముగానుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| మ.పు. | అభూః | అభూతమ్ | అభూత |
| ఉ పు. | అభూవమ్ | అభూవ | అభూమ |

దీనిలో విభక్తి ప్రత్యయములందు జరుగు మార్పులన్నియు లజ్‌లో వలెనే యుండును. అక్కడ "శప్" వికరణ ప్రత్యయము వచ్చును ఇది ఆర్ధధాతుకము కనుక దీనిలో 'శప్' రాదు. రెండింటికి అంతమాత్రమే భేదము. (అ + భూ + తి > అ + భూ + త్ = అభూత్). లుజ్‌లో ధాతువునకు, విభక్తి

ప్రత్యయమునకు నడుమ 'సిచ్' (స్) అనునది వచ్చును. కాని అది పెక్కు ధాతువులలో లోపించును. కొన్నింటిలో మాత్రము నిలుచును. భూ ధాతువులో అది లోపించును. ఆత్మనేపదరూపములలో సాధారణముగా కాన్పించును. కావున పై రూపములలో అడాగమము ధాతువు, తిఙ్ ప్రత్యయము మాత్రమే కన్పడుచున్నవి. 'పిచ్' లోపించనిచోట దానికి ఇడాగమము, తిఙ్నకు ఈడాగమము వచ్చి ఆ రెండింటి నడుమనున్న 'సిచ్' సకారము లోపించును.

ఉదా: అవాదీత్, అవాదిష్టామ్, అవాదిషుః అను రీతిలో రూపములుండును. ఈ లుఙ్‌కు ముందు 'మా' అనునది చేరినప్పుడు నిషేదార్థము వచ్చును. ఉదా: "మాభూత్" అనగా కాకుండుగాక అని యర్థము.

ఆత్మనేపదములో లుఙ్ రూపములు :—

| | | | |
|---|---|---|---|
| ప్ర.పు. | ఐధిష్ట | ఐధిషాతామ్ | ఐదిషత |
| మ,పు. | ఐధిష్ఠాః | ఐధిషాధామ్ | ఐధిఢ్వమ్ |
| ఉ.పు. | ఐధిషి | ఐధిష్వహి | ఐధిష్మహి |

సిచ్ యొక్క సకారము ఆత్మనేపదరూపములలో స్పష్టముగా గోచరించును. దానికిముందు ఇకారము ఆగమముగా వచ్చి సకారము షకారముగా మారును. ఏధధాతువు అజాది గనుక దీనికి లుఙ్‌లో ఆకారము ఆగమముగా వచ్చును. ఆ + ఏ కలిపి వృద్ధి వలన ఐకారముగా మారును. ఆ,ఐ,ఔలకు వృద్ధియని వ్యాకరణమున సంజ్ఞకలదు.

10. చివరి లకారమగు లృఙ్ హేతుమద్భావము (conditional) న ప్రవర్తించును. దీనిలోగూడ ధాతువునకు ముందు అడాగమ, ఆడాగమములు వచ్చును. లృట్‌లోవలె దీనియందుకూడ ధాతువు తరువాత స్య ప్రత్యయము చేరును.

లృఙ్‌లో పరస్మైపద రూపములు ఇట్లుండును.

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అభవిష్యత్ | అభవిష్యతామ్ | అభవిష్యన్ |

| | | | |
|---|---|---|---|
| మ. పు. | అభవిష్యః | అభవిష్యతమ్ | అభవిష్యత |
| ఉ. పు. | అభవిష్యమ్ | అభవిష్యావ | అభవిష్యామ |

స్య ప్రత్యయము వచ్చుట, దానికి ఇడాగమము చేరుట తప్ప తక్కిన అన్ని విషయములు లఙ్‌లో వలెనే ల్ఋఙ్‌లో కూడ ఉండును.

ఇక ఆత్మనేపద ల్ఋఙ్ రూపములు: —

| | | | |
|---|---|---|---|
| ప్ర. పు. | అవర్తిష్యత | అవర్తిష్యేతామ్ | అవర్తిష్యంత |
| మ. పు. | అవర్తిష్యథాః | అవర్తిష్యేథామ్ | అవర్తిష్యధ్వమ్ |
| ఉ. పు. | అవర్తిష్యే | అవర్తిష్యావహి | అవర్తిష్యామహి |

పరస్మైపదిలోవలెనే ఆత్మనేపదిలోకూడ స్యప్రత్యయము దానికి ఇడాగమముత్పతక్కిన యన్ని విషయములలో లఙ్ రూపములతో సామ్యము కల్గి యుండును.

ల్ఋఙ్ ప్రయోగము భాషలో చాల విరళముగా ఉండును. హేతుహేతుమద్భావము (Conditonal) న్న చోటనే ఇది ప్రయోగింప బడుచుండును.

ఉదా త్వం యది సమ్యగ పఠిష్యః తర్హి పరీక్షాముదతరిష్యః (నీవు బాగుగా చదివిన యెడల పరీక్షలో ఉత్తీర్ణుడవుకాగలవు)

పది లకారములలో పరస్మైపది, ఆత్మనేపది ధాతువుల రూపములు స్థాలీపులాకన్యాయముగా చూపబడినవి. ఏదో ఒక గణములోని రూపములు మాత్రమే ప్రదర్శించనైనది. వేర్వేరు గణములలోని (Conjugation)ధాతువులకు ఆయాలకారములలో రూపములందు కొంత భేదముండును

సంస్కృత భాషలోని క్రియాపదములలో మరియొక విశేషము కలదు. తెలుగు, హిందీ మొ॥ నేటి భారతీయ భాషలన్నిటలోను లింగభేదమును బట్టి క్రియా రూపములలో మార్పు కలుగు చున్నది.

ఉదా :-

| | | |
|---|---|---|
| తెలుగు | 1. | అతడు పాడుచున్నాడు (పుంలింగము) |
| | 2. | ఆమె పాడుచున్నది (స్త్రీలింగము) |
| హిందీ | 1. | వహ గాతా హై। (పుంలింగ్) |
| | 2. | వహ గాతీహై। (స్త్రీ-లింగ్) |
| సంస్కృతము | 1. | సః గాయతి (పుంలింగ్) |
| | 2. | సా గాయతి స్త్రీలింగ్) |

పై మూడు జంటలలో మొదటి రెండింటియందు లింగమును బట్టి క్రియలలో మార్పుకనబడుచున్నది. కాని మూడవ జంటలో సంస్కృతవాక్యములందు రెండు లింగములందును 'గాయతి' అను ఒకే రూపము కలదు. అనగా ఈ భాషలో మూడులింగములందును క్రియాపదముల రూపములు భేదములేక ఏక రూపములుగా నుండునని గ్రహింపవలెను.

## కర్తరి కర్మణి ప్రయోగములు
## (Active and Passive voices)

ధాతువు మీద వచ్చు ప్రత్యయములలో కొన్ని కర్తను, మరి కొన్ని కర్మను బోధించును. కొన్ని చోట్ల కేవల ధాత్వర్థములోనే ప్రత్యయములు వచ్చును. దీనినే భావార్థమందురు. వాక్యార్థములో కర్త ప్రధానముగానున్నచో కర్తరి ప్రయోగమనియు, కర్మ ప్రధానముగానున్న కర్మణి ప్రయోగమనియు వ్యవహరింపబడును.

ఉదా॥ 1. బాలకః పుస్తకం పఠతి
(బాలకుడు పుస్తకమును చదువుచున్నాడు)
ఇది కర్తరి ప్రయోగము. (active Voice)

2 బాలకేన పుస్తకం పఠ్యతే
(బాలకునిచేత పుస్తకము చదువబడుచున్నది)
ఇది కర్మణి ప్రయోగము. (Passive Voice)

పై రెండు వాక్యములలో మొదటి దానియందు కర్తయగు బాలకునకు క్రియాపదముతో సాక్షాత్తుగా అన్వయముకలదు. కావున కర్తరి ప్రయోగము. రెండవవాక్యములో కర్మ యగు పుస్తకము క్రియతో అన్వయించుచున్నది. అందువలన అది కర్మణి ప్రయోగమనబడును. కర్తరి ప్రయోగమున క్రియాపదమునంలి విభక్తి ప్రత్యయము కర్తను, కర్మణి ప్రయోగములో నది కర్మను బోధించును.

ధాతువులు సకర్మకములు, అకర్మకములు అని రెండు విధములు. కర్మాకాంక్షకలవి సకర్మకములు, అవిలేనివి అకర్మకములు. క్రియాపదమును వినగనే ఏనివి, ఎవరిని, వేనిని అను ప్రశ్న కలిగినచో అది సకర్మకధాతువు అని తెలియవలెను ఉదా॥ రామః పచతి (రాముడు వండుచున్నాడు) అను వాక్యమును వినగానే దానియర్థము పూర్తిగా బోధపడదు. దేనిని.అను ప్రశ్న కలుగుచున్నది. కావున "పచతి" అనునది సకర్మకక్రియ. రామః అన్నం పచతి (రాముడు అన్నమువండుచున్నాడు) అని చెప్పిన వాక్యార్థము పూర్తిగా బోధపడును. ఇట్లే హన్ (చంపుట) దా (ఇచ్చుట) దృశ్ (చూచుట) మొదలగు ధాతువులు సకర్మకములు. ఈ ధాతువుల క్రియలతో ఏర్పడు వాక్యములు కర్తరి, కర్మణి ప్రయోగరూపములలో రెండు విధములుగా ఉండును. కర్మణి ప్రయోగములో ధాతువు పైన "యక్" ప్రత్యయముచేరి, ఆత్మనేపదిగా మారును.

అకర్మక ధాతువులతో కర్తరి ప్రయోగము భావే ప్రయోగము అనునవి ఏర్పడును. వీనికి కర్మ సంబంధములేదు కనుక కర్మణి ప్రయోగముండదు. అస్ (ఉండుట) జన్ (పుట్టుట) వృధ్ (పెరుగుట) మొదలగు ధాతువులు అకర్మకములు.

ఉదా॥ 1. సః అస్తి (వాడు ఉన్నాడు)
2 శిశుః జాతః (శిశువు పుట్టినది)
3. రామః వర్ధతే (రాముడు వృద్ధి పొందుచున్నాడు)

పై వాక్యములు వినినప్పుడు దేనిని, వేనివి వంటి ప్రశ్నలు కలుగుట లేదు. కావున అందలి క్రియలు అకర్మకములు. కర్తరి ప్రయోగములు రెండు విధములు.

1 అకర్మక కర్తరి ప్రయోగము.
2 సకర్మక కర్తరి ప్రయోగము.
అకర్మక క్రియతో నేర్పడినది మొదటిది.
ఉదా॥ రామః విరాజతే (రాముడు ప్రకాశించు చున్నాడు)
సకర్మక క్రియతో నేర్పడినది రెండవ ప్రయోగము.
ఉదా॥ రామః భూమండలం అపాలయత్ (రాముడు భూమండలమును పాలించెను)

భావే ప్రయోగము చాల అరుదుగా ప్రయోగములందు కాన్పించును. భావార్థములలోగూడ కర్మార్థమునందువలె క్రియాపద రూపములుండును.

ఉదా॥ రామేణ భూయతే (రాముడు ఉండుట) భావమనగా ధాత్వర్థమే, "భూయతే" అను క్రియాపదములోని విభక్తి ప్రత్యయముకూడ ధాత్వర్థమునే తెలుపును. అకర్మక ధాతువులమీద మాత్రమే భావార్థక ప్రత్యయములువచ్చును.

క్రియాపదములలో స్వార్థకము, ప్రేరణార్థకము అను రెండు భేదములు కలవు స్వార్థకమనగా ధాతువుయొక్క సహజమగు అర్థము. దానిని మాత్రము కర్తృ కర్మలద్వారా బోధించునది స్వార్థక క్రియ. ఆ క్రియను మరొకరితో చేయించుట ప్రేరణము. అట్టి క్రియను బోధించునది ప్రేరణార్థకము (Caus-atiue verb). ఉదా॥ కరోతి (చేయుచున్నాడు). కరిష్యతి (చేయగలడు) పఠతి (చదువుచున్నాడు) ఇటువంటివి స్వార్థక్రియలు. కారయతి (చేయించు చున్నాడు) పాఠయతి (చదివించుచున్నాడు) కారయిష్యతి (చేయించగలడు) వంటివి ప్రేరణార్థక క్రియలు.

ప్రేరణార్థకములలో ధాతువునకు పరముగా "ణిచ్" అను ప్రత్యయము వచ్చును. దానిలో "ఇ" మాత్రము మిగులును. 10 వగణములోని ధాతువులకు స్వార్థమునందే ణిచ్ ప్రత్యయమువచ్చును, ప్రేరణార్థములో అన్నిగణముల ధాతువుల మీదను "ణిచ్" చేరును. క్రియారూపములు మాత్రము రెండింటికి సమానముగనే యుండును.

ఉదా॥ 1. చుర్ + ఇ + అ + తి > చోర్ + ఇ + అ + తి > చోర్ + ఏ + అ + తి > చోర్ + అయ్ + అ + తి = చోరయతి. దొంగిలించుచున్నాడని యర్థము. ఇది స్వార్థ "ణిచ్" తో గూడిన రూపము.

2. పఠ్ + ఇ + అ + తి > పాఠ్ + ఇ + అ + తి > పాఠ్ + ఏ + అ + తి > పాఠ్ + అయ్ + అ + తి = పాఠయతి. ఇది ప్రేరణార్థక ణిజంతమున కుదాహరణము - రెండు రూపములందును 'ణిచ్', ఇతర ప్రక్రియ సమానమే. స్వార్థ ణిజంతముమీద మరల ప్రేరణార్థమున ణిచ్ వచ్చినను మొదటి ణిచ్ లోపించి చోరయతి (దొంగలింప జేయుచున్నాడు) వంటి రూపమే యేర్పడును. సందర్భమును బట్టి యర్థము చెప్పుకొనవలెను.

కొన్నిధాతువుల స్వార్థ, ప్రేరణార్థక క్రియారూపము లీక్రింది విధముగా నులడును.

| | ధాతువు | స్వార్థరూపము | ప్రేరణక్రియ |
|---|---|---|---|
| 1 | భూ | భవతి | భావయతి |
| 2 | డుకృఞ్ | కరోతి | కారయతి |
| 3 | వచ్ | వక్తి | వాచయతి |
| 4 | పచ్ | పచతి | పాచయతి |
| 5 | దృశ్ | పశ్యతి | దర్శయతి |
| 6 | గమ్ | గచ్ఛతి | గమయతి |

# అనుబంధము 2

## ఉపసర్గలు, ( Prefixes )

ధాతువులకు ముందు భాగమున జేరి, వానిలో ఒక భాగమై పోవునవి ఉపసర్గలనబడును. ఇవి చేరుటవలన కొన్నిచోట్ల ధాతువుల అర్థములు కూడ మార్పుచెందును. అవి 20 కలవు.

ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్ (నిర్), దుస్ (దుర్), వి, ఆఙ్, ని, అధి, అతి, అపి, అభి, ప్రతి, పరి, ఉత్, ఉప, సు.

క్రియా వాచకములగు ధాతువులతో చేరినప్పుడే వీనికి ఉపసర్గలను పేరు కలుగును. ప్రభవతి, అనుకరోతి, ప్రదర్శయతి మొదలగు క్రియలలో 'ప్ర' మొదలగునవి ఉపసర్గలగును. ధాతువునకు, ఉపసర్గకు మధ్య సంధి నిత్యము.

ఉపసర్గలు ధాతువుతో చేరినప్పుడు కొన్నిచోట్ల అర్థము మారుచుండును. కొన్ని స్థలములలో విశిష్టార్థమును, మరికొన్ని స్థలములలో ధాత్వర్థమునకు భిన్నార్థమును గూడ తెలుపుచుండును.

క్రమముగా ఉదాహరణములు :—

1 గదతి = చెప్పుచున్నాడు.
నిగదతి = చెప్పుచున్నాడు. } ఉపసర్గ చేరినను అర్థము మారలేదు.

2 వర్థతే = వృద్ధి పొందుచున్నాడు.
ప్రవర్థతే = బాగుగా వృద్ధి పొందుచున్నాడు.
ఉపసర్గవలన అతిశయార్థము వచ్చినది.

3 కరోతి = చేయుచున్నాడు
ఉపకరోతి = ఉపకారముచేయుచున్నాడు. ఇక్కడ భిన్నార్థము కలిగినది.

4 గచ్ఛతి = వెళ్లుచున్నాడు.
ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు. (వ్యతిరిక్తార్థకము)

ఇంతేకాక ఒకే ధాతువు వేర్వేరు ఉపసర్గలు చేరినప్పుడు, వేర్వేరు అర్థములను బోధించుట సంస్కృత భాషయందలి మరియొక విశేషము.

ఉదా॥ హృఞ్ = హరణే అను ధాతువునకు హరించుట ముఖ్యార్థము. హరతి = దొంగిలించుచున్నాడు.

* దీని కాయా ఉపసర్గలు చేరినప్పుడు అర్థము లెట్లు మారునో చూతము :

(ప్ర) హరతి = కొట్టుచున్నాడు.
(ఆ) హరతి = భుజించు చున్నాడు.
(సం) హరతి = చంపుచున్నాడు.
(వి) హరతి = విహరించు చున్నాడు
(పరి) హరతి = వదలివేయు చున్నాడు.
6 (ఉప) హరతి = కానుక ఇచ్చుచున్నాడు.
7 (ఉత్) హరతి = పైకెత్తుచున్నాడు.
(ఉద్ధరతి)

పై క్రియలు ఒకేధాతువుయొక్క రూపములైనను భిన్నములగు ఉపసర్గలు చేరుటవలన భిన్నార్థముల నిచ్చుచున్నవి. ధాతువులన్నియు ఈవిధముగా, ఇన్ని యర్థములను బోధింపక పోవచ్చును. కాని మొత్తముమీద ఉపసర్గ సంబంధము ధాతువుల అర్థమును మార్చగలుగుట మాత్రము యథార్థము.

---

* శ్లో॥ ఉపసర్గేణ ధాత్వర్థో బలాదన్యత్ర నీయతే।
ప్రహారాహార సంహారవిహార పరిహారవత్ ॥

కొన్ని ధాతువులు ఉపసర్గ యోగమువలన ఆత్మనేదులు పరస్మై పదులుగాను, పరస్మైపదులు ఆత్మనే పదులుగాను మారుటకూడకలదు. ఉదా।। "రము=క్రీడాయామ్" అను ధాతువు సహజముగా ఆత్మనేపది. కాని కాని 'వి, ఆఙ్, పరి' అను ఉపసర్గలతో గూడినప్పుడు పరస్మైపదిగా మారును. కేవల ధాతువు రమతే రమేతే రమంతే మొదలగు విధముగా నుండును. పై ఉపసర్గలు చేరినప్పుడు విరమతి, ఆరమతి ఇత్యాది పరస్మైపద రూపములనందును. అదే విధముగా "ష్ఠా= గతినివృత్తౌ" అను ధాతువు పరస్మైపది అయినను "సమ్, అవ, ప్ర, వి" అను ఉపసర్గలు చేరినప్పుడు అత్మనెపదియగును. ఉదా।। తిష్ఠతి (కేవలధాతువు)

ప్రతిష్ఠతే (ఉపసర్గయోగము) ఇచ్చట అర్థముకూడ మారినది.

ఈ ప్రాదులు ధాతువులతోచేరి యేకపదముగనే పరిగణింపబడును. ధాతువులకు, వీనికి మధ్యవ్యవధానముండదు. కాని ప్రాదులందలి అను, అభి, ప్రతి" అనునవి మాత్రము విడిగా ప్రయోగింపబడుటయు, అవి ద్వితీయాంత ములగు పదములతో అన్వయించుట కాన్పించును.

ఉదా।। పితరం అను పుత్రః గచ్ఛతి.

గంగాం అభి వారణసీ వర్తతే.

ఇవి ప్రాదులలోనివి కావనియు, వీనికుపసర్గ సంజ్ఞ లేదనియు వ్యాకరణ మతము.

ఈ 20 ఉపసర్గలు కాక, వీనివలెనే ధాతువులకు ముందు చేరు కొన్ని అవ్యయములు కలవు. వానికి గతిసంజ్ఞ ఉండును. అవి ముఖ్యముగా "కృ, భూ, అస్, ధా, గమ్" అను ధాతువులతో చేరుచుండును. వానిలోగూడ మొదటి మూడిటితో ఎక్కువగా చేరును. ఉదా।। అలం+కరోతి=అలంకరోతి (అలంక రించుచున్నాడు)

2 ప్రాదుః + భవతి = ప్రాదుర్భవతి
(సాక్షాత్కరించుచున్నాడు)

సాక్షాత్, ఊరీ, పురస్, అంతర్, నమః మొదలగునవి కూడ ఈ తరగతికి జెందిన అవ్యయములు. ఇవి ఉపసర్గలుకావు కాని అన్ని విషయముల లోను ఉపసర్గలవలెనే పరిగణింపబడును.

ప్రాదులు కొన్నిచోట్ల నామవాచకములకు ముందు గూడ ఉండును. అప్పుడు వావి కుపసర్గసంజ్ఞ యుండదు. క్రియాపదముతో గూడినప్పుడే యుపసర్గలనబడును.

## * అవ్యయములు (Adverbs)

లింగము, విభక్తి, వచనము అనువానివలన ఎటువంటి మార్పును బొందక, ఎల్లప్పుడొకేరూపమున నుండునవి అవ్యయములనబడును. వ్యయము (నాశము) లేనివి అవ్యయములు. నాశమనగా మార్పు అని ఇక్కడ గ్రహింపవలెను. ఇవి సాధారణముగా క్రియాపదములకు విశేషణములుగా నుండును కనుక క్రియావిశేషణము లనబడును. ఉదా॥ సః శీఘ్రంగచ్ఛతి. (అతడు తొందరగా వెళ్ళుచున్నాడు) ఈ వాక్యములో 'శీఘ్రమ్' అను అవ్యయము 'గచ్ఛతి' అను క్రియకు విశేషణమైనది. అనగా వెళ్లుట యను క్రియ ఏ విధముగా జరుగుచున్నదో తెలుపును.

అవ్యయములు, కాలవాచకములు, దేశవాచకములు, రీతివాచకములు-అని ముఖ్యముగా మూడువర్గములుగా నుండును.

1. తదా (అప్పుడు), శ్వః (రేపు), ఇదానీమ్ (ఇప్పుడు) సర్వదా (ఎల్లప్పుడు) హ్యః (నిన్న), మొదలగునవి కాలవాచకములు.

---

* శ్లో. సదృశం త్రిషులింగేషు సర్వాసుచ విభక్తిషు ।
వచనేషు చ సర్వేషు యన్న వ్యేతి తదవ్యయమ్ ॥

2 తత్ర (అక్కడ), సర్వత్ర (అంతట), కుత్ర (ఎక్కడ), అత్ర (ఇక్కడ) మొదలగునవి దేశవాచకములు.

3. తథా (అట్లు), ఇత్థమ్ (ఈవిధముగా), సర్వథా (అన్నివిధముల), కథమ్ (ఎట్లు) ఇత్యాదులు రీతివాచకములు. అనగా ప్రకారార్థకములు. కొన్ని అవ్యయములు విభక్త్యంత శబ్దములవలె రూపములు కలిగియుండును. ఒకప్పుడవి, నామవాచకములో, విశేషణములో అయియుండి, తరువాత అవ్యయములుగా మారియుండును. ఇటు వంటి అవ్యయములను విభక్తి ప్రతిరూపకములందురు.

ఉదా చిరేణ, చిరాయ' పశ్చాత్, స్థానే మొద॥ ఇవిక్రమముగా తృతీయా చతుర్థీ, పంచమి, సప్తమి విభక్త్యంతములగు పదములవలె గోచరించును. కాని వాని యర్థము మాత్ర మట్లుండదు వానికి ఇతర విభక్తులు గాని, వచనములు కాని లేవు.

అవ్యయములలో కొన్ని, నామవాచకములవలె అర్థము కలిగియుండి వాక్యములలో ప్రయోగింపబడును. ఉదా॥ స్వస్తి భవతు. (శుభముకలుగుగాక) నమః కరోతి (నమస్కారముచేయుచున్నాడు) ఇత్యాదులు.

పూర్వము చెప్పబడిన కాలవాచక, దేశవాచక, రీతివాచకావ్యయములు, నామవాచకములపై తద్ధిత ప్రత్యయములు చేరగా నేర్పడినవి.

ధాతువులమీద కృత్ ప్రత్యయములుచేరి యేర్పడినఅవ్యయములు కొన్ని కలవు. (కృదంతములు) కృత్వా (చేసి), కర్తుమ్ (చేయుటకు) స్మారంస్మారమ్ (స్మరించి స్మరించి) మొద॥ నవి అట్టివి.

ఇవికాక అవ్యయీభావ సమాసము వలన ఏర్పడిన పదములన్నియు అవ్యయములే. ఉదా॥ యథాశక్తి, ప్రత్యక్షమ్, నిర్మక్షికమ్ మొద॥

సహజములగు అవ్యయములు కూడ కొన్నికలవు, చ, వా, అపి, తు, ఏవం ప్రభృతులు అటువంటివి.

ఈవిధముగా సహజములు, వ్యాకరణ సిద్ధములును అగు అవ్యయము లన్నియు సాక్షాత్తుగాగాని, పరంపరగాగాని క్రియాపదములతో అన్వయించు చునేయుండును. అందుచేత క్రియాపదములను గూర్చి తెలిసికొనునప్పుడు, వానితో సంబంధము కల అవ్యయములను గూర్చికూడ తెలియుట అవసరము కనుక పై విషయములన్నియు వివరింపబడినవి.

ఇంతకు పూర్వము చెప్పినట్లు కృదంతములగు అవ్యయములలో క్త్వా, తుమున్, ల్యప్ ప్రత్యయాంతములు ముఖ్యమైనవి. క్త్వాప్రత్యయము అసమాపక క్రియార్థమున వచ్చును. దీనిలో కకారము ఇత్సంజ్ఞ వలన పోగా త్వా మాత్రము లక్ష్యములలో కాన్పించును.

కొన్ని క్త్వాప్రత్యయాంతములగు అవ్యయములు, వాని యర్థములు

1 కృత్వా (చేసి)
2 శ్రుత్వా (విని)
3 గత్వా (వెళ్ళి)
4 దృష్ట్వా (చూచి)
5 పఠిత్వా (చదివి)
6 ఉక్త్వా (పలికి)
7 లిఖిత్వా (వ్రాసి)
8 మత్వా (తలచి) ఇత్యాదులు

ల్యప్ అనునది ధాతువులమీద స్వతంత్రముగారాదు. ఉపసర్గ చేరినప్పుడును, నఞ్ సమాసముతప్ప ఇతరసమాసములందును క్త్వా ప్రత్యయస్థానమున 'ల్యప్' వచ్చును.

ఉదా॥

| | ధాతువు | క్త్వాంతము | ల్యబంతము |
|---|---|---|---|
| 1 | గమ్ | గత్వా | ఆగత్య |
| 2 | దా | దత్వా | ప్రదాయ |
| 3 | శ్రు | శ్రుత్వా | సంశ్రుత్య |
| 4 | భూ | భూత్వా | సభూయం |
| 5 | కృ | కృత్వా | ఉపకృత్య |

'ల్యప్' లో లకారము, మరియు పకారము ఇత్సంజ్ఞచే లోపించి 'య' మాత్రము మిగులును.

నఞ్ సమాసములో మాత్రము "క్త్వా"కు"ల్యప్" ఆదేశముగారాదు. అకృత్వా; ఎట్లనగా; న+గత్వా=అగత్వా, న+కృత్వా,=న+శ్రుత్వా+ అశ్రుత్వా, మొదలగు విధముగా రూపములుండును.

'తుమున్' ప్రత్యయము ఒక క్రియకొరకు మరొక క్రియయేర్పడి యున్నప్పుడు పూర్వము ప్రయోగింపబడుధాతువునకు వచ్చును. దీనిలో 'తుమ్, మాత్రమే లక్ష్యములలో కాన్పించును.

ఉదా ॥ 1 కర్తుం గచ్ఛతి (చేయుటకు వెళ్లుచున్నాడు) దీనిలో "కర్తుమ్" అనునది తుమున్ ప్రత్యయాంతము,

2 సః పఠితుం వసతి. (అతడు చదువుట కొరకు ఉంటున్నాడు) ఇక్కడ 'పఠితుమ్' అను పదము తుమున్నంతము.

ఈ తుమున్ ప్రత్యయము పరమైనప్పుడు కొన్ని ధాతువులకు గుణము, కొన్నిటికి సంప్రసారణము, వచ్చుచుండును. 'కృ' ధాతువునకు తుమున్ చేరి ధాతువులోని ఋకారమునకు గుణము (అర్) వచ్చి కర్తుమ్ అనియగును, ఋకారమునకు గుణము మరియు వృద్ధి రావలసినప్పుడు క్రమముగా అర్,ఆర్

వచ్చును. అట్లే "శ్రు" ధాతువునకు తుమున్ చేరగా 'శ్రోతుమ్' అను రూప మేర్పడును. అనగా ధాతువులోని ఉకారమునకు గుణము ఓకారమువచ్చును. పై రెండుధాతువులు అనిట్ దాతువులు. కాని 'సేట్' దాతువులయినచో 'తుమున్' ప్రత్యయమునకుముందు ఇడాగమముకూడ వచ్చును.

ఉదా ॥ 1 పఠ్ + తుమ్ > పఠ్ + ఇ + తుమ్ = పఠితుమ్.

2 సేవ్ + తుమ్ > సేవ్ + ఇ + తుమ్ = సేవితుమ్.

3 వంద్ + తుమ్ > ఇంద్ + ఇ + తుమ్ = వందితుమ్.

ఈ క్త్వా, తుమున్ ప్రత్యయములు చేరినప్పుడు కొన్నిధాతువులకు సంప్రసారణము వచ్చును. య్,వ,ర,ల అను వర్ణములకు క్రమముగా ఇ, ఉ ఋ,ఌ వర్ణములాదేశములగుటను సంప్రసారణమందురు. ఉదా॥ వచ్ + క్త్వా > ఉచ్ + క్త్వా > ఉచ్ + త్వా > ఉక్ + త్వా = ఉక్త్వా. ఇచట వకార స్థానములో ఉకారము వచ్చినది కనుక సంప్రసారణము. చకారస్థానమున కకారము ఆదేశమైనది. అట్లే "దృశ్" ధాతువునకు తుమున్ ప్రత్యయము చేరగా, దృశ్ + తుమ్ > ద్రష్ + తుమ్ > ద్రష్ + తుమ్ = 'ద్రష్టుమ్' అగును.

ఇక్కడ సంప్రసారణమువలన ఋకారమునకు రేఫము వచ్చినది. శకారమునకు షకారము వచ్చి, ష్టుత్వసంధి వలన తకారము టకారముగా మారును.

క్త్వాప్రత్యయము చేరినప్పుడు, ధాతువు చివరనున్న అనునాసికాక్షరము సాధారణముగా లోపించును.

ఉదా॥ గమ్ + త్వా + గత్వా

నమ్ + త్వా = నత్వా

మన్ + త్వా = మత్వా

హన్ + త్వా = హత్వా మొదలగునవి.

తద్ధితాంతములగు అవ్యయములలో, పూర్వము చెప్పినవికాక మరికొన్ని కలవు. వలె అను అర్థములో 'వత్' ప్రత్యయము చేరిన శబ్దములు అవ్యయములుగా మారును. ఉదా॥ రామవత్ వర్తతే, (రామునివలె ఉన్నాడు) రామ శబ్దముమీద వత్ ప్రత్యయము రాగా 'రామవత్' అని అయినది. జలం అమృతవత్ విద్యతే (నీరు అమృతమువలె ఉన్నది) ఉపమానవాచక శబ్దముల మీద ఈవతి ప్రత్యయమువచ్చి, ఉపమావాచకముగా పనిచేయును.

ఈ విధముగా సహజములు, కృదంతములు, తద్ధితాంతములు – అని అవ్యయములు మూడు ప్రధానవర్గములుగా విభజింపదగియున్నవి, అన్నివిధముల అవ్యయములు కూడ ఏదో విధముగా క్రియాపదములతో సంబంధము కలిగియే యుండును. వానిలో చాల భాగము క్రియా విశేషణములుగను తక్కినవి క్రియాన్వయము కలవిగను ఉండును.

## సన్నంత క్రియలు

ధాతువుల మీద ఇచ్ఛార్థమున–అనగా కోరుచున్నాడు, కోరుచున్నది యను అర్థము నందు "సన్" అను ప్రత్యయము వచ్చును. ఉదా॥ కర్తుం ఇచ్ఛతి (చేయుటకు కోరుచున్నాడు) అను అర్థములో "కృ" ధాతువు మీద "సన్" ప్రత్యయము చేరగా "చికీర్ష" అను ధాతువేర్పడి లట్‌లో చికీర్షతి మొద॥ రూపములు సిద్ధించును. సన్ ప్రత్యయములో నకారము ఇత్సంజ్ఞకము కాగా "స" మాత్రము మిగులును. "సన్" పరమగునప్పుడు ధాతువునకు ద్విత్వము, అభ్యాసకార్యములు కొన్ని జరుగును. కవర్గహకారములకు చవర్గమాదేశమగుట, అకారమునకు ఇకారమాదేశమగుట, అభ్యాసమందలి మొదటి హల్లుకాక తక్కిన హల్లులు లోపించుట మొదలగునవి అభ్యాస కార్యము లనబడును. భూతార్థకమగు లిట్‌లోవలె "సన్" ప్రత్యయముచేరి నప్పుడు కూడ, ఆర్ధధాతుకము కనుక ఇడాగమము వచ్చును. ఉదా॥ 1.గన్తుంఇచ్ఛతి=గమ్+స +తి> గమ్‌గమ్+స+తి> గగమ్+స+తి> జగమ్+స+తి> జిగమ్+ స +తి> జిగమ్+ఇ+స+తి = జిగమిషతి. (వెళ్లుటకు కోరుచున్నాడు). ఇకారము తరువాత వచ్చు సకారము షకారముగా మారును.

2. పతితుంఇచ్ఛతి = పత్ + స + తి > పత్ పత్ + స + తి > పపత్ + స + తి > పిపత్ + స + తి > పిపత్ + ఇసతి = పిపతిషతి. (చదువుటకు కోరు చున్నాడు)

"సన్" ప్రత్యయము అంతమందుగల సముదాయమునకు "సనాద్యంతా ధాతవః" అనుసూత్రము వలన ధాతుసంజ్ఞవచ్చి దానిమీద క్రియావిభక్తులు వచ్చును. అవి ఆయాలకారముల రూపములను గూడ పొందును. అట్లే సన్నంత రూపము మీద కృత్ ప్రత్యయములు చేరగా నామవాచకము లేర్పడును. ముముక్షుః, తితీర్షుః, చికీర్షుః మొదలగునవి వానికుదాహరణములు.

కొన్నిధాతువుల సన్నంత రూపములు, వానినుండి యేర్పడిన సుబంత శబ్దములు క్రింద చూపబడు చున్నవి.

| | ధాతువు | తిజంత రూపము | సన్నంత క్రియ. | దానినుండి యేర్పడినసుబంతము |
|---|---|---|---|---|
| | రమ్ | రమతే | రిరంసతే | రిరంసా, రిరంసుః |
| 2 | పా | పిబతి | పిపాసతి | పిపాసా |
| 3 | జి | జయతి | జిగీషతి | జిగీషా |
| 4 | జ్ఞా | జానాతి | జిజ్ఞాసతి | జిజ్ఞాసా |
| 5 | వచ్ | వక్తి | వివక్షతి | వివక్షా |
| 6 | హన్ | హంతి | జిఘాంసతి | జిఘాంసుః |
| 7 | యా | యాతి | యియాసతి | యియాసుః |
| 8 | దృశ్ | పశ్యతి | దిదృక్షతి | దిదృక్షుః |

పై రూపములలో చివరి కాలమందున్నవికొన్ని భావార్థకములుకాగా, తక్కినవి కర్త్రర్థకములు. "రిరంసా" అనగా రమించుకోరిక. ఇది భావార్థక శబ్దము, 'రిరంసుః' అనగా రమించుటకు కోరువాడు. ఇది కర్త్రర్థకము.

సన్నంతములగు ధాతువులమీద మరల కర్మార్థక ప్రత్యయము చేరిన తిజంతరూపములు కూడ ఏర్పడును. ఉదా॥ పిపాస్యతే (త్రాగుటకుకోరబడు

చున్నది). సన్నంతమైన పాధాతువు రూపము (పిపాస) పైనమరల కర్మార్థమున యక్ ప్రత్యయము వచ్చి 'తిఙ్'లు చేరగా పిపాస్యతే మొదలగు రూపములు ఏర్పడును. దీని వలెనే రిరంస్యతే జిజ్ఞాస్యతే మొదలగు కర్మార్థకరూపములను గ్రహింపవలెను. ఈ కర్మార్థకములమీద మరల వర్తమానార్థమున 'శానచ్' ప్రత్యయమువచ్చి, పిపాస్యమానః జిఘాంస్యమానః మొదలగు రూపములు నిష్పన్నములగును.

సన్ ప్రత్యయము రాకముందు ధాతువు పరస్మైపది, ఆత్మనేపదులలో నేదైన సన్నంతముకూడ ఆరూపములనే పొందును.

## యఙ్ ప్రత్యయము

ధాత్వర్థమగు వ్యాపారము మాటిమాటికి (Frequently) లేదా మిక్కిలిగా (Intensely) జరుగునప్పుడు ధాతువునకు పరముగా "యఙ్" ప్రత్యయము వచ్చును. అది వచ్చిన తరువాత వానితో గూడిన రూపము ధాతు సంజ్ఞను బొంది దానిపై మరల పురుషవచన ప్రత్యయములేర్పడును.

ఉదా॥ "భూ" ధాతువుమీదయఙ్ ప్రత్యయము వచ్చినప్పుడు బోభూయతే అనురూపమగును. ఇది లట్ ప్ర.పు. ఏకవచనరూపము.

భూ + యఙ్ + త > భూభూ + య + త > భోభూ + య + త > బోభూ + య + త = బోభూయతే. మరల మరల, లేక అత్యంతముగా అగుచున్నాడు/ది అని యర్థము.

బుధ = ధాతువునకుయఙ్ ప్రత్యయము చేరినచో బోబుధ్యతే అని యగును. ఙకారము 'ఇత్' గాగల ధాతువుఆత్మనేపది యగును కనుక 'యఙ్' అంతమందున్న ధాతువులన్నియు ఆత్మనేపది రూపములనే పొందును. మొదట పరస్మైపది రూపములనే పొందును. మొదట పరస్మైపది యైనను 'యఙ్' చేరగనేయది ఆత్మనేపది ధాతువగును. సన్ వలెనే యఙ్ ప్రత్యయము వచ్చి నప్పుడు కూడ ధాతువునకు ద్విత్వము, అభ్యాసకార్యములు జరుగును. కర్మణి

యక్ ప్రత్యయము చేరిన ధాతువునకు వలెనే యజంతమునకు ఆయాలకారము లందు రూపములుండును.

ఈ యజ్ కొన్నిచోట్ల లోపించుట కూడజరుగును. ఇట్లు 'యజ్' వచ్చి తరువాత లోపించిన ధాతువును యఙ్లుగంతము అందురు. యఙ్లుగంత ధాతువునకు పరస్మైపది రూపములే యుండును. ఉదా॥ భూదాతువునకు యఙ్లుగంత రూపము బోభోతి, బోభవీతి అను విధముగా నుండును. "కృ" ధాతువునకు చర్కరీతి చర్కర్తి మొదలగు రూపములుండును. మొత్తముమీన భాషలో వీని ప్రయోగము చాలస్వల్పము. కవుల ప్రౌఢ కావ్యములలోను, పండితుల శాస్త్ర వాదములందుసు ఇట్టి యజ్: యఙ్లుగంత ప్రయోగములు కాన్పించును.

## నామధాతువులు

సుబంతములగు నామవాచకములు మొదలగునవి క్రియలుగా మారి నప్పుడు అవి నామ ధాతువులనబడును. ఉదా:– పుత్రం ఆత్మనః ఇచ్ఛతి (తనకు కుమారుని కోరుచున్నాడు/ది) అను అర్థములో పుత్రీయతి అనియు కృష్ణః ఇవఆచరతి (కృష్ణునివలె చేయుచున్నాడు) అను అర్థములో కృష్ణాయతే, కృష్ణతి అను రూపములును ఏర్పడును.

సుబంతశబ్దములమీద క్యచ్, కామ్యచ్, క్విప్, క్యఙ్, క్యష్, ణిచ్, ణిఙ్ అను ప్రత్యయములు చేరి ఆ సముదాయము ధాతువగును. వానిలో తన కొరకు కోరుచున్నాడు అను అర్థములో క్యచ్, కామ్యచ్ ప్రత్యయములు వచ్చును.

ఉదా: పుత్రం ఆత్మనః ఇచ్ఛతి= పుత్ర+అమ్+క్యచ్+తి > పుత్ర+య+తి > పుత్రీ+య+తి=పుత్రీయతి

2. పుత్ర+అమ్+కామ్యచ్+తి > పుత్ర+కామ్య+తి=పుత్రకామ్యతి

సుబంతములోని విభక్తి ప్రత్యయములు సమాసములలోవలె నామధాతు ప్రక్రియలోకూడ లోపించును. ప్రత్యయముల చివరనున్న హల్లులకు ఇత్సంజ్ఞ లోపించును.

ఉపమానవాచకమైన సుబంతముమీద 'ఆచరించుట' అను అర్థములో కూడ క్యచ్ ప్రత్యయము వచ్చును. రూపములు పైవానివలెనే అగును. అర్థము మాత్రము భిన్నము. ఉదా॥ పుత్రమివ ఆచరతి = పుత్రీయతి అనగా పుత్రుని వలె చూచుచున్నాడని అర్థము.

2. ప్రాసాదే ఇవ ఆచరతి = ప్రాసాదీయతి, మేడయందువలె ప్రవర్తించు చున్నాడు అని యర్థము. మొదలగునవి.

ఉపమాన వాచకమగు శబ్దముమీద కర్త్రర్థమున 'ఆచరించుట' అను అర్థములో క్యఙ్ మరియు క్విప్ ప్రత్యయములు వచ్చును. 'క్యఙ్'లో ఙకారము ఇత్సంజ్ఞ కలది. కనుక దానితో ఏర్పడిన ధాతువు ఆత్మనేపదములో నుండును. క్యచ్ వచ్చినప్పుడు పూర్వమందున్న అకారము ఈకారమగును. కాని క్యఙ్ వచ్చినచో పూర్వమందలి అచ్చునకు దీర్ఘము మాత్రము వచ్చును.

ఉదా ॥ 1. కృష్ణః ఇవ ఆచరతి = కృష్ణాయతే

2. గురుః ఇవ ఆచరతి = గురూయతే

ఇత్యాదులు. పూర్వమందున్న పదము సకారాంతమైనచో చివరి సకారము లోపించును. ఉదా: విద్వాన్ ఇవ ఆచరతి = విద్వాయతే. ఈ సకారలోపము నిత్యముకాదు. కనుక విద్వస్యతే అను రూపముకూడ ఉండును.

ఏదేని శబ్దము పుంలింగములోను మరియు స్త్రీ నపుంసక లింగములలో ఉన్నచో దానిని భాషితపుంస్కము అందురు. భాషిత పుంస్కమగు స్త్రీ లింగ శబ్దముమీద క్యఙ్ ప్రత్యయము వచ్చినపుడు పూర్వమందున్న శబ్దము పుంవద్భావ మును — అనగా పుంలింగములోని శబ్దముయొక్క రూపమువంటి రూపమును పొందును,

ఉదా : 1. కుమారీ ఇవ ఆచరతి = కుమారాయతే

2. యువతిః ఇవ ఆచరతి = యువాయతే

కుమారీ, యువతి శబ్దములు భాషిత పుంస్కములు. ఎందుకనగా అవికుమార, యువన్ అను రూపములలో పుంలింగమున గూడ ఉండును.

ఇక పై యర్థములోనే క్విప్ ప్రత్యయమువచ్చినప్పుడు

1. కృష్ణః ఇవ ఆచరతి = కృష్ణతి
2. మాలా ఇవ ఆచరతి = మాలాతి
3. రాజా ఇవ ఆచరతి = రాజానతి

మొదలగు విధముగా రూపములేర్పడును. క్విప్ ప్రత్యయములోని అన్ని వర్ణములకు ఇత్సంజ్ఞవలన లోపమేఁలగును. కావున క్రియారూపములలో దాని గుర్తులేవియు కనబడవు. కృష్ణ+క్విప్+శప్+తి> కృష్ణ+అ + తి= కృష్ణతి. నకారాంత శబ్దములకు ఉపధాదీర్ఘము వచ్చును కనుక రాజన్+అ+తి=రాజానతి అవియగును. క్విప్ ప్రత్యయము వచ్చినతరువాత పూర్వశబ్దమునకు "సనాద్యంతా ధాతవః" అను సూత్రమువలన ధాతుసంజ్ఞవచ్చును. కనుక వానికి శప్ వికరణము, తిజ్ ప్రత్యయములును చేరును.

లోహితాది శబ్దములమీదను, డాచ్ ప్రత్యయము అంతమందు గలవానిమీదను క్యష్ ప్రత్యయము. అగుచున్నాడు/ది అను అర్థములో వచ్చును. అప్పుడు దాని రూపములు క్యచ్ ప్రత్యయము వచ్చినప్పటివలెనే ఉండును. ఉదా:లోహితః భవతి=లోహితాయతి. క్యష్ ప్రత్యయము అంతమందుగల ధాతువు ఉభయ పదిగానుండును. కావున దీనికి "లోహితాయతే" అను ఆత్మనేపద రూపము కూడ నుండును.

ణిచ్, ణిజ్ అను ప్రత్యయములు ఆయా అర్థములందు కొన్ని శబ్దయిల మీద చేరును. వానిలో ణిచ్ ప్రత్యయాంతములు పరస్మైపదులుగను ణిజ్ ప్రత్యయాంతములు ఆత్మనేపదులుగను మారును దీని రూపములు చురాది గణములోని రూపములవలెనుండును. ఉదా॥ భాండాని సమాచినోతి = సంభాండయతే (భాండములను సేకరించుచున్నాడు)

2. హలం గృహ్ణాతి = హలయతి (నాగలి పట్టుకున్నాడు) 3. విద్వాంసం ఆచష్టే = విద్వయతి (పండితుని గూర్చి చెప్పుచున్నాడు.)

పైమూడింటిలో మొదటిది 'ణిజ్' ప్రయమునకు తక్కినరెండు 'ణిచ్' ప్రత్యయమునకు ఉదాహరణములు.

ఈ విధముగా నామ వాచకములు, సర్వనామములు, విశేషణములు అవ్యయములు గూడ ఆయా అర్థములందు క్యచ్ మొదలగు ప్రత్యయములను గ్రహించి నామధాతువులుగా ఏర్పడును. వానిమీద శప్ మొదలగు వికరణములు తిజ్ ప్రత్యయములు ఇతరధాతువులకు వలెనేవచ్చును. ఈనామధాతువుల మీద కూడ శతృ, శానచ్ ప్రత్యయములు వచ్చి పుత్రీయన్, యశస్యన్, కృష్ణాయమానః, అప్సరాయమాణా మొదలగు రూపములేర్పడును. సాధారణముగా నామధాతువులయొక్క వర్తమానకాలరూపములే ఎక్కువగ ప్రయోగములలో కాన్పించును. ఇతర లకారములు చాల అరుదుగాకవబడును.

## 'శతృ', శానచ్ ప్రత్యయములు

ధాతువులమీద వచ్చు ప్రత్యయములకు (తిజ్‌లుకాక మిగిలినవి) కృత్ ప్రత్యయములని పేరు. వానిలో వర్తమానార్థమున వచ్చునవి శతృ, శానచ్ ప్రత్యయములు (Present continuous) పరస్మైపది ధాతువులమీద శతృప్రత్యయమును ఆత్మనేపది ధాతువులమీద శానచ్ ప్రత్యయమును వచ్చును. తద్ధితభిన్నములైన ప్రత్యయముల మొదటనున్న ల,శ,క వర్గాక్షరములు ఇత్సంజ్ఞవలన లోపించును. కావున శతృశానచ్ ప్రత్యయముల మొదటి శకారము లోపించును. వాని అంతమందున్న ఋకారము మరియు చకారము కూడ ఇత్సంజ్ఞకములే. దాని ఫలితముగ శతృప్రత్యయములో 'అత్' అనియు శానచ్ ప్రత్యయములో 'ఆన' అనియు మిగులును. ఇత్సంజ్ఞకల అక్షరములను ఆయా ప్రత్యయములలో చేర్చుటకు ప్రయోజనము ఇతర స్థలములందు కాన్పించును.

1. శతృప్రత్యయాంతమునకు ఉదాహరణము.

భూ + అ + అత్ > భో + + అత్ > భవ్ + అ + అత్ = భవత్

అను క్రమములో భవత్ అను శబ్దము నిష్పన్న మగును. ధాతువులోని ఊకారముకు గుణము వచ్చి అవాదేశము వలన పై రూపమేర్పడినది. భవత్ శబ్దము ప్రథమా విభక్తి ఏక వచనమునభవన్ అని యగును. అగుచున్న వాడు లేక అగుచున్న ది అని దాని యర్థము.

2. శానచ్ ప్రత్యయాంతమునకు ఉదాహరణము.

లభ్ ధాతువు ఆత్మనేపది. దాని మీద వర్తమానార్థమున శానచ్ ప్రత్యయము వచ్చి శప్ వికరణము చేరగాలభమాన అను శబ్దము నిష్పన్న మగును,

లభ్ + అ + ఆన > లభ + మ్ + ఆన = లభమాన

ఆన యనునది పరమగునపుడు అకారాంతమగు అంగమునకు మకారము ఆగమముగా చేరును. కావున లభమాన, వందమాన, సేవమాన మొ॥ రూపములు ఏర్పడును. ఇవి అకారాంత శబ్దములు.

శతృప్రత్యయాంతములగు శబ్దములు స్త్రీ లింగములో సాధారణముగా ఈకారాంతములుగా నుండును. ఉదా॥ గచ్ఛంతీ, పచంతీ, క్రీడంతీ మొదలగునవి. ఉభయపది ధాతువులమీద శతృ, శానచ్ ప్రత్యయములు రెండును చేరును. కావున 'పచ్' ధాతువునకు పచన్, పచమానః అను రెండురూపము లేర్పడును.

శతృ ప్రత్యయాంతశబ్దములు పుంలింగములో ప్రయోగింపబడునపుడు, వాని తుదియచ్చునకు నకారము అంతాగమముగా వచ్చును, దీనిని నుమాగమ మందురు. ఉదా॥ పచత్ > పచన్ త్ > పచన్ - సంయోగాంతమగు తకారము లోపింపగా నకారము పదాంతమున శేషించును. ఇట్లే పశ్యన్, గచ్ఛన్, కుర్వన్ మొదలగు శత్రంత పుంలింగశబ్దములన్నియు నిష్పన్నము లగును.

'శానచ్' ప్రత్యయమునకు పూర్వమందున్న అంగము అకారాంతము కానిచో మకారము ఆగమముగారాదు. అప్పుడు రుధ్+ఆన > రుంధ్+ ఆన=రుంధానః, శీ—ఆన > శే+ ఆన= శయానః ఇత్యాదిరూపములుగా శబ్దములేర్పడును.

ఈ విధముగా, వర్తమానార్థములో శతృ, శాన చ్ ప్రత్యయములు చేరిన పదములన్నియు వర్తమానార్థక విశేషణములు(Present participles) అని వ్యవహరింపబడును.

ఈ ప్రత్యయములు భవిష్యదర్థకమగు ల్రృట్ స్థానములోగూడ వచ్చును. అప్పుడు ధాతువుమీద 'స్య' ప్రత్యయము, దాని తరువాత శతృ, శానచ్ ప్రత్యయములు వచ్చును.

ఉదా॥ 1 భూ+ఇ+స్య+అత్ > భో+ఇ+స్య+అత్ > భవ్+ ఇ+స్య+అత్ = భవిష్యత్,

2 గమ్+ఇ+స్య+అత్ > గమ్ +ఇ+ ష్య + అత్ = గమిష్యత్

మొదలగు శబ్దములు నిష్పన్నములగును. వాని ప్రథమైక వచన రూపములు భవిష్యన్, గమిష్యన్, కరిష్యన్ అను విధముగా నుండును. ఇవి కూడ స్త్రీలింగములయినప్పుడు భవిష్యంతీ, గమిష్యంతీ మొ॥ రీతిగా ఈకారాంతములుగనే యుండును, నపుంసక లింగములో భవిష్యత్, గమిష్యత్ ప్రభృతి ప్రాతిపదికరూపములే ప్రథమైకవచనములో నిల్చును.

శతృప్రత్యయము కేవలము కర్త్రర్థములోనే వచ్చును. కాని శానచ్ ప్రత్యయము కర్తృ, కర్మార్థములు రెండింటియందును వచ్చును. కర్మార్థములో ధాతువు ఆత్మనేపదమందే యుండును కనుక ధానిమీద శానచ్ ప్రత్యయము తప్పక చేరుతుంది. ధాతువు, దాని తరువాత యక్ ప్రత్యయము (కర్మార్థకము) దానికి పరముగా శానచ్ ప్రత్యయముచేరి రూపములేర్పడును.

ఉదా॥ 1 పఠ్ + యక్ + ఆన > పఠ్ + య + మ్ + ఆన > పఠ్య + మాన = పఠ్యమానః (చదువబడుచున్నది)

2 గమ్ + యక్ + ఆన > గమ్ + య + ఆన > గమ్ + య + ఆన = గమ్యమానః. (పొందబడుచున్నది)

ఆకారాంతములగు అంగములకు పూర్వమువలెనే మకారము ఆగమముగా వచ్చినది. (పై రూపములలో) భవిష్యదర్థక శానచ్ ప్రత్యయాంతములకు కర్త్రర్థక, కర్మార్థక రూపములు రెండును ఒకేవిధముగా ఉండును.

ఉదా॥ కరిష్యమాణః = చేయబోవుచున్నవాడు

" = చేయబడనున్నవాడు

కర్త్రర్థ, కర్మార్థములలో శానచ్ ప్రత్యయము వచ్చిన కొన్నిధాతువుల రూపములిట్లుండును.

| | ధాతువు | కర్త్రర్థకము | కర్మార్థకము |
|---|---|---|---|
| 1 | దా | దదానః | (వర్త) దీయమానః |
| | | | (భవిష్య) దాస్యమానః |
| 2 | వచ్ | — | (వర్త) ఉచ్యమానః |
| | | | (భవిష్య) వక్ష్యమాణః |
| 3 | కృఞ్ | కుర్వాణః | (వర్త) క్రియమాణః |
| | | | (భవిష్య) కరిష్యమాణః |
| | మన్ | మన్వానః | (వర్త) మన్యమానః |
| | | | (భవిష్య) మంస్యమానః |
| 5 | వహ్ | — | (వర్త) ఉహ్యమానః |
| | | | (భవిష్య) వక్ష్యమాణః |
| 6 | యాచ్ | యాచమానః | (వర్త) యాచ్యమానః |
| | | | (భవిష్య యాచిష్యమాణః |

## ఇతర కృదంతములు

పూర్వము క్త్వా, ల్యప్, తుమున్ అను కృత్ ప్రత్యయములను గూర్చి తెలిపియుంటిని. అవి యంతమందుగలవి కృదంతములైన అవ్యయములు. శతృ, శానచ్‌లుకూడ కృత్ ప్రత్యయములే. కాని అవి యంతమందుగలవి నామవాచకములుగాను, విశేషణములుగాను ఏర్పడును. అవికాక మరికొన్ని కృదంతములు కలవు. వానినిగూర్చి కొంతపరిచయము చేయుదును.

తవ్యత్, తవ్య, అనీయర్ అను కృత్‌ప్రత్యయాలు ధాతువులమీద చేరును. తగినది, అర్హమైనది అను అర్థములో నీ ప్రత్యయములు వచ్చును. వీనిలో మొదటి రెండింటిలో 'తవ్య' అవిమాత్రమే మిగులును. వానివలన నిష్పన్నములైన శబ్దములు ఏకరూపముగనేయుండును. 'తవ్యత్' లోని చివరి తకారము ఇత్సంజ్ఞకము. అది కేవలము వేదభాషలో స్వరప్రయోజనమునకై చేర్పబడినది. తవ్య, అనీయర్ ప్రత్యయములు చేరినపుడు ధాతువులోని అచ్చునకు గుణము వచ్చును. ఉదా: 1. కృ + తవ్య > కర్ + తవ్య = కర్తవ్యమ్.

2 కృ + అనీయ > కర్ + అనీయ = కరణీయమ్. ఈ రెండు పదములకు చేయదగినది అని అర్థము. రెండవ పదములో నకారము ణకారముగ మారినది, రేఫషకారముల తరువాతవచ్చు నకారము ణకారముగ మారుట సహజము.

3. దృశ్ + తవ్య > ద్రశ్ + తవ్య > ద్రష్ + తవ్య = ద్రష్టవ్యమ్. ఇచ్చట ధాతువులోని ఋకారమునకు సంప్రసారణము (ర), శకారమునకు షకారము, ష్టుత్వసంధియు వచ్చినవి. ఈ పదమునకు చూడదగినది అని అర్థము. దృశ్ ధాతువు మీద అనీయర్ ప్రత్యయమురాగా దర్శనీయమ్ అను పద మేర్పడును.

ఈ విధమైన శబ్దములు విశేష్యమునను సరించి మూడు లింగములందును ఉండును.

కరణీయః (పుం) కరణీయా (స్త్రీ) కరణీయమ్ (నపుం) అట్లే తక్కిన శబ్దములకు గూడ తెలియవలెను.

ణ్వుల్, తృచ్ అను ప్రత్యయములు కర్త్రర్థములో ధాతువుమీద వచ్చును. ణ్వుల్‌లో 'వు' అనునది తృచ్‌లో 'తృ' అనునది మాత్రము శేషించును 'యువోరనాకౌ' అను సూత్రము వలన వు స్థానమున అక ఆదేశమగును

ఉదా। 1 కృ + ణ్వుల్ > కృ + అక > కార్ + అక = కారకః (చేయువాడు అని అర్థము). ఋకారమునకు వృద్ధి వచ్చినది.

2 కృ + తృచ్ > కృ + తృ > కర్ + తృ = కర్తృ ప్రథమా ఏకవచనమున 'కర్తా' అని యగును. చేయువాడు అని ఈ పదమునకు అర్థము. దీనిలో ఋకారమునకు గుణము వచ్చినది.

ణ్వుల్, తృచ్ ప్రత్యయములు వచ్చిన మరికొన్ని కృదంతరూపములు

| | ధాతువు | ణ్వుల్ | తృచ్ |
|---|---|---|---|
| | పఠ్ (చదువు) | పాఠకః | పఠితా |
| 2 | బుధ్ (తెలిసికొను) | బోధకః | బోద్ధా |
| 3 | వచ్ (చెప్పుట) | వాచకః | వక్తా |
| 4 | దృశ్ (చూచు) | దర్శకః | ద్రష్టా |
| 5 | పచ్ (వండు) | పాచకః | పక్తా |
| 6 | రక్ష్ (కాపాడు) | రక్షకః | రక్షితా |

తృచ్ ప్రత్యయాంత శబ్దములు స్త్రీలింగములో ఈకారాంతములగును, భావార్థము (ధాతువుయొక్క సహజమగు అర్థము)లో ల్యుట్ ప్రత్యయము

వచ్చును. దీనిలో లకార టకారములు ఇత్సంజ్ఞ వలనలోపించును. "యు" మాత్రము మిగులును. పైన చూపబడిన సూత్రము ప్రకారము "యు" స్థానమున "అన" ఆదేశమగును.

ఉదా॥ 1 కృ + ల్యుట్ > కృ + యు > కృ + అన > కర్ + అన = కరణమ్. (చేయుట)

ధాతువులోని ఋకారమునకు గుణము (అర్)వచ్చినది.

2 గమ్ + ల్యుట్ > గమ్ + యు > గమ్ + అన = గమనమ్ (వెళ్లుట)

పై రెండుదాహరణములు భావార్థమునకు సంబంధించినవే. ల్యుట్ ప్రత్యయాంతములు సాధారణముగా నపుంసకలింగములోనుండును. దర్శనమ్ వచనమ్, లేఖనమ్, పఠనమ్, స్మరణమ్, బోధనమ్ – ఇత్యాదు లన్నియు ల్యుట్ ప్రత్యయాంతములు.

"క్త, క్తవతు" అను రెండు ప్రత్యయములకు "నిష్ఠా" అని పాణిని వ్యాకరణములో సంజ్ఞ కలదు. వానిలోక్త ప్రత్యయము, కర్త్రర్థములోను కర్మార్థములోను వచ్చును. క్తవతు ప్రత్యయము మాత్రము కర్త్రర్థము నందే వచ్చును రెండింటిలోను మొదటి క కారము ఇత్సంజ్ఞకము. క్రమముగా "త" అనియు, "తవతు" అనియు లక్ష్యములలో కాన్పించును. ఇవికూడ ఆర్ధధాతుక ప్రత్యయములే కనుక సేట్ ధాతువులలో వీనికి ఇకారాగమము (ఇట్) వచ్చును.

ఉదా॥ 1 పఠ్ + క్త > పఠ్ + త > పఠ్ + ఇత = పఠితః (చదువబడినది)

2 చల్ + క్త > చల్ + త > చల్ + ఇత = చలితః (కదలినది)

3 భాష + క్త > భాష + ఇత = భాషితః (పలుకబడినది)

ఈమూడును సేట్ధాతువుల క్త ప్రత్యయాంతరూపములు

1 గమ్ + క్త > గమ్ + త > గ + త = గతః

2 యా + క్త > యా + త = యాతః

3 హన్ + క్త > హన్ + త > హ + త = హతః

ఈమూడు అనిట్ ధాతువులరూపములు. పైవానిలో గతః, యాతః అను పదములలో క్తప్రత్యయము కర్తను బోధింపగా హతః అనుచోట అది కర్మార్థమున వచ్చెను. పైధాతువులకు క్తవతు ప్రత్యయముచేరినచో వాని రూపములు క్రిందివిధముగా నుండును.

1. పతితవాన్
2. చలితవాన్
3. భాషితవాన్
4. గతవాన్
5. యాతవాన్
6. హతవాన్

క్త ప్రత్యయము చేరగా ఏర్పడిన రూపముపైన పుంలింగములో 'వాన్' అనియు స్త్రీలింగములో 'వతీ' అనియు, నపుంసకలింగములో 'వత్' అనియు చేర్చినచో క్తవతు ప్రత్యయాంత రూపము లేర్పడును. అకర్మకధాతువులమీద కర్తృ, భావార్థములలో క్త ప్రత్యయము వచ్చెను. ఉదా। 1. స్థా + త > స్థి + త = స్థితమ్ (ఉండుట)

2. భీ + త = భీతమ్ (భయపడుట)

భావార్థములో క్త ప్రత్యయము వచ్చినశబ్దములు నపుంసక లింగములో నుండును. భీతః (భయపడినవాడు) అని కర్త్రర్థములోకూడ ప్రయోగములు కలవు,

క్త ప్రత్యయములో 'త' మాత్రము రూపములలో కాన్పించునని లోగడ చెప్పితిమి. చాలవరకు శబ్దములందు అట్లే కనబడును. కాని కొన్ని

ధాతువులమీద వచ్చిన క్త ప్రత్యయపు తకారము ఇతరవర్ణములను పొందు చుండును. అట్టివి భిన్నభిన్నములుగా ఉండును.

ఉదా: 1. పచ్ + త > పచ్ + వ > పక్ + వ = పక్వః

2. శుష్ + త > శుష్ + క = శుష్కః

3. మ్లా + త > మ్లా + న = మ్లానః

4. జ్యా + త > జ్యా + న > జీర్ + న = జీర్ణః

5. ఫల్ + త > ఫుల్ + ల = ఫుల్లః

6. భిద్ + త > భిద్ + న > భిన్ + న = భిన్నః

7. వహ్ + త > ఉహ్ + త > ఉహ్ + ధ > ఉఢ్ = ఢ > ఊఢ్ + ఢ = ఊఢః

ఇట్లు క్త ప్రత్యయ తకారము భిన్నరూపముల నందుచుండును. మొత్తము మిద భాషలో ఇటువంటి విశిష్ట రూపములు స్వల్పములే.

కొన్ని ధాతువులకు ఈ ప్రత్యయము పరమైనపుడు సంప్రసారణ వచ్చును. ఉదా॥ 1 వద్ + త < ఉద్ + త < ఉద్ + ఇత = ఉదితమ్ (చెప్పః నది)

2 వచ్ + త > ఉచ్ + త > ఉక్ + త = ఉక్తమ్ (చెప్పబడినది)

3 యజ్ + త > ఇజ్ + త > ఇష్ + త = ఇష్టమ్ (వేల్చబడినది)

అచ్చు అంతమునగల ధాతువుల మీద యోగ్యము అను అర్థమ యత్ ప్రత్యయము వచ్చును.

ఉదా॥ 1 జి + య > జే + య = జేయమ్ (గెలువదగినది)

2 ని + య > నే + య + నేయమ్ (కొనిపోదగినది)

3 భూ + య > భో + య > భవ్ + య = భవ్యమ్ (

4 దా + య > దే + య = దేయమ్ (ఇవ్వదగినది)

పై రూపములలో మొదటి మూడు ధాతువులకు గుణమువచ్చినది. చివరి ధాతువు ఆకారమునకు ఏకారము వచ్చినది. యత్ ప్రత్యయములో తకారము ఇత్సంజ్ఞ వలన లోపింపగా 'య' మాత్రమే మిగులును.

ఋకారము కాని, హల్‌కాని అంతమందున్న ధాతువులకు పై యర్థములోనే ణ్యత్ ప్రత్యయము వచ్చును. దీనిలోగూడ ణకార తకారములు ఇత్సంజ్ఞ కలవి. అందువలన య మాత్రమే రూపములలో కాన్పించును. కాని ణ్యత్ ప్రత్యయము వచ్చినచోట ధాతువులోని అచ్చునకు వృద్ధివచ్చుట విశేషము.

ఉదా॥ ఋకారాంతములకు

1. కృ+ణ్యత్> కృ+య> కార్+య=కార్యమ్ (చేయదగినది)
2. హృ+ణ్యత్ > హృ + య > హార్ + య + హార్యమ్ (హరింపదగినది)

హలంతములకు

1. పఠ్+ణ్యత్ > పఠ్+య > పాఠ్+య=పాఠ్యమ్ (చదువదగినది)

2. వచ్+ణ్యత్ > వచ్+య > వాచ్+య వాచ్యమ్ (చెప్పదగినది)

పై నాలుగురూపములలో మొదటి రెండింటికి ఋకారమునకు, చివరి రెండింటికి ఉపధయగు అకారమునకు వృద్ధి వచ్చినది.

లిఖ్, విచ్, విద్ వంటి అకారము ఉపధగాలేని హలంతధాతువులకు ణ్యత్ ప్రత్యయము వచ్చినను వృద్ధిరాక గుణము మాత్రమే వచ్చును.

ఉదా॥ 1. లిఖ్+ణ్యత్ > లిఖ్+య> లేఖ్+య+లేఖ్యమ్(వ్రాయదగినది)

2, విద్ + ణ్యత్ > విద్ + య > వేద్ + య = వేద్యమ్ ఇత్యాదులు.
(తెలియదగినది)

ఈ ప్రత్యయములేకాక ఘఞ్, అచ్, అప్ మొదలగునవి. మరికొన్ని కృత్ ప్రత్యయములు కూడ కలవు. వాని వలన రామః, జయః కరః వంటి అకారాంతశబ్దములు నిష్పన్నములగును. ఆయా విశేషములు తెలిసికొనగోరు వారు సంస్కృత వ్యాకరణ పరిచయముద్వారా వానిని గ్రహింపవచ్చును.

సంస్కృత వ్యవహారములో కృదంత శబ్దములకు మిక్కిలి ప్రాముఖ్యము కలదు. వాక్యములలో క్రియాపదముల స్థానమున కృదంత శబ్దములను వాడి వాక్యములను ముగింపవచ్చును.

ఉదా: 1. మయా ఇదమ్ కార్యమ్ కర్తవ్యమ్.
(నాచేత ఈ పని చేయదగియున్నది)

2, ఇదమ్ నగరమ్ తేన జితమ్.
(ఈ పట్టణము అతనిచేత గెలువబడినది)

3. అహమ్ హ్యః తత్ర గతః.
(నేను నిన్న అక్కడికి వెళ్ళినాను)

పై వాక్యములలో కర్తవ్యమ్, జితమ్, గతః అను పదములు క్రియా పదముల స్థానమున ప్రయోగింపబడిన కృదంతములు. వాడుకలోనున్న నామ వాచక, విశేషణ, అవ్యయములలో అధికభాగము కృదంత శబ్దములే.

భావార్థములో క్తిన్ అను ప్రత్యయము ధాతువులమీద వచ్చును. దీనిలో తి మాత్రము మిగులును. ఇది అంతమందుగల శబ్దములు స్త్రీలింగములో నుండును.

ఉదా ॥ 1. గమ్ + క్తిన్ > గమ్ + తి > గ + తి = గతిః

2. కృ + క్తిన్ > కృ + తి = కృతిః

3. ష్టు + క్తిన్ > స్తు + తి = స్తుతిః
4. యజ్ + క్తిన్ > యజ్ + తి > ఇజ్ + తి > ఇష్ + తి = ఇష్టిః.

పై వానిలో మొదటి ధాతువులో మకారము లోపించుట, మూడవదానిలో షకారమునకు సకారము వచ్చుట, నాల్గవధాతువులోని యకారమునకు సంప్రసారణము వచ్చుట అనునవి విశేషములు.

ల్యుట్ ప్రత్యయమువచ్చి ఏర్పడిన గమనమ్, కరణమ్, స్తవనమ్, యజనమ్ అను శబ్దములుకూడ పైనాల్గు శబ్దములకు సమానార్థకములు. కాని ల్యుట్ ప్రత్యయాంతములు నపుంసకలింగములో నుండును.

ఇంకను కొన్ని కృత్ ప్రత్యయములు ఆయాధాతువులమీద వచ్చి కొన్ని శబ్దములేర్పడును. అటువంటి ప్రయోగములుచాల విరళము. ముఖ్యముగా ఎక్కువ వ్యవహారములోనుండు కృదంతశబ్దములను గూర్చి పరిచయము చేయుట జరిగినది. విశేషముగా తెలియగోరువారు సంస్కృతవ్యాకరణము ద్వారా ఆయా విషయములను గ్రహింపవచ్చును.



# వాక్యములలోని క్రియాపదముల పట్టిక

-:o:-

# 'వాక్యములందలి' కృదంతముల అవ్యయముల పట్టిక

| | | |
|---|---|---|
| 22 | పర్యాలోచితా | 62 |
| 23 | ప్రచోదితాః | 59 |
| 24 | ప్రతిపాదితా | 5 |
| 25 | ప్రతిజ్ఞాపితా | 49 |
| 26 | ప్రదత్తాః | 16 |
| 27 | ప్రదేయా | 72 |
| 28 | ప్రబోధితాః | 32 |
| 29 | ప్రయతితుమ్ | 46 |
| 30 | ప్రవేశయితుమ్ | 20 |
| 31 | ప్రసారితః | 82 |
| 32 | ప్రేషితః | 13 |
| 33 | భర్త్సితమ్ | 91 |
| 34 | వర్తితవ్యమ్ | 21 |
| 35 | విజ్ఞాపితః | 11 |
| 36 | విధేయాః | 28 |
| 37 | విశ్వస్తాః | 33 |
| 38 | విస్తారితా | 44 |
| 39 | వ్యవస్థాపితా | 61 |
| 40 | సమవాప్తమ్ | 69 |
| 41 | సమారబ్ధః | 92 |
| 42 | సమ్మిలితా | 38 |
| 43 | సంలబ్ధాని | 18 |
| 44 | స్థాపయితుమ్ | 62 |
| 45 | స్వీకృతమ్ | 21 |

-:o:-